# సృజన

1984 మేడే సంచిక
151



ఈ సంచిక రు. 3 సంవత్సరచందా రు. 20

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

151 మాసపత్రిక మే 1984



| నిర్వహణ సాహితీ మిత్రులు | సృజన హనుమకొండ 506 001. | ఈ సంచిక రు. 3 సంవత్సరచందా రు. 20 |
|---|---|---|

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Printed, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002 for Venkataramana Mudranalayam, Warangal

# మేడే చిరకాలం వర్ధిల్లుగాక

స్టాలిన్

కామ్రేడ్స్!

గత శతాబ్దంలోనే అన్నిదేశాలకుచెందిన కార్మికులు యీ మే 1వ తేదీని ఉత్సవంగా జరుపుకోవాలని తీర్మానించుకున్నారు. అది 1389. అన్నిదేశాల సోషలిస్టుల సమావేశంలో కార్మికులు ప్రకటించారు. సరిగ్గా ఇదేరోజు మే నెలలో మొదటిరోజు ప్రకృతి తన చలినిద్రనుండి మేల్కొంటున్న వేళ, అడవులు, పర్వతాలు ఆకుపచ్చగా మెరుస్తున్న వేళ, పొలాలు, పచ్చికబయళ్ళు పూవులతో అలంకరించుకుంటున్న వేళ, సూర్యుడు మరింతవెచ్చగా ప్రకాశిస్తున్న వేళ, గాలిని పునర్జీవన ఆనందం పరవశింపచేస్తున్న వేళ, ప్రకృతి సంతోషంలో మైమరచి నాట్యంచేస్తున్న వేళ, సరిగ్గా ఇదేరోజు కార్మికులు బిగ్గరగా, బహిరంగంగా మొత్తం ప్రపంచానికి ప్రకటించడానికి తీర్మానించుకున్నారు. ఏమని? మానవజాతికి కార్మిక వర్గం వసంతాన్ని తేబోతున్నదని, పెట్టుబడిదారీ సంకెళ్ళనుండి విముక్తి తేబోతున్నదని, ప్రపంచాన్ని స్వాతంత్ర్యం, సామ్యవాదం పునాదులమీద పునర్వికసింపచేయడమే కార్మికుల లక్ష్యమని.

ప్రతి వర్గానికి దానికిష్టమైన పండుగలుంటాయి. సంపన్నులు తమతమ పండుగలను ప్రవేశపెట్టారు. వాటి పేరుమీద రైతాంగాన్ని దోచుకునే తమ "హక్కు" ప్రకటించుకున్నారు. బూర్జువాలకు వాళ్ళపండుగలున్నాయి. వాటిపేరుమీద కార్మికులను కొల్లగొట్టే తమహక్కును సమర్థించుకున్నారు. చట్టబద్ధంచేసారు. మతాచార్యులకు కూడ వారి, వారి పండుగలున్నాయి. వాటిపేరుమీద కష్టజీవులు పేదరికంలో మరణిస్తూ, సోమరులు సుఖ సౌఖ్యాల్లో ఓలలాడుతున్నా ఈ వ్యవస్థను పొగుడుతారు.

కార్మికులకు కూడ వారి పండుగలుండాలి. ఆ పండుగరోజు వాళ్ళిలా ప్రకటించాలి. "సర్వజనీనమైన శ్రమ, సర్వవ్యాపకమైన స్వాతంత్ర్యం మానవులందరికీ సర్వజనీనమైన సమానత్వం, ఆ పండుగే మేడే పండుగ. మనం బంగారు నందిని పూజించం. మనం బూర్జువాల, దోపిడీదారుల సామ్రాజ్యాన్ని కోరడంలేదు. పేదరికం భయోత్పాతాన్ని రక్తపాతాన్ని సృష్టిస్తున్న పెట్టుబడిదారీ వ్యవస్థనాశనంకావాలి. చచ్చిపోవాలి. కార్మికులరాజ్యం చిరకాలం వర్ధిల్లుగాక."

ఇదే ఈ రోజున వర్గచైతన్యంకల సకలదేశ కార్మికులు ప్రకటిస్తున్నారు. (రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్‌పార్టీ (కమ్యూనిస్టుపార్టీ) కేంద్రకమిటీ కరపత్రంనుంచి. 1912.)

( — సృజన 68 మే 1975 సంచికనుండి పునర్ముద్రణ)

# సంకేతాలు

నిన్నటి వరకు విప్లవాలన్నీ తమసంకేతాలనూ ప్రమాణాలనూ గతంనుండి ఎంచుకున్నాయి. ఆధునిక విప్లవంమాత్రం భవిష్యత్తునుండే ఎంచుకోవాలని మార్క్స్ అన్నాడు. ఆధునికవిప్లవంఅంటే కార్మికవిప్లవం.

ఫ్రెంచివిప్లవం తన ఆదర్శాన్ని ప్రాచీన గ్రీక్ గణతంత్రంలో చూసుకుంది. తన్నుతాను ప్రాచీనగ్రీస్‌తోపోల్చుకొని ఒక్కొక్కసారి సంతృప్తి పడింది ఒక్కొక్క సారి నిస్పృహచెందింది. భారత జాతీయఉద్యమం తన ప్రమాణాలను రామరాజ్యం లోనూ రాయలనాటి వైభవంలోనూ వెతుక్కుంది. ఆ ధర్మం ఆవైభవం ఏమయ్యాయని వాపోయింది. ఈ ఆవేదనలో ఒక కృత్రిమస్వరంఉంది. గ్రీక్ ప్రజాతంత్రం ఏహక్కులూలేని బానిసల చాకిరీమీదనిలబడి ప్రపంచానికి ప్రజాస్వామ్యాన్నిగురించి ఉపన్యాసాలు ఇచ్చింది. రామరాజ్యధర్మం వర్గసమాజపు వర్ణధర్మం. శ్రామికుడికి శ్రమచేయడంధర్మం, రాజుకు పరిపాలించడం ధర్మం, అని వర్గసమాజపు అసమాన ప్రవృత్తినే దైవసంకల్పంగా నిలబెట్టిన మార్మికసిద్ధాంతం. కాకతీయులవైభవం. సంవత్సరంలో సగంకాలం భూస్వాముల భోగాలకోసంశ్రమించి, మిగిలిన సగం కాలం తనపొలాన్ని బీడుపెట్టి రాజుగారి కీర్తికిరీటంలో మరొక్కరత్నాన్ని పొదగడం కోసం రక్తార్పణచేసిన రైతుదేహాన్నీ ప్రాణాన్నీ భూమినీ చీకట్లోనుంచి శూన్య ఆకాశాన్ని వెలుగుతోనింపిన రాచరికవైభవం. ఈ ప్రజాతంత్రాన్నీ ఈ ధర్మాన్నీ ఈ వైభవాన్నీ ప్రామాణికంగా ఎంచుకున్నవాళ్లు ఈ వాస్తవాలస్థానాన ఒక కల్పిత చిత్రాన్ని, ఒకపురాణాన్ని, నిలబెట్టారు. గతచరిత్రలోనుండి ఆధునిక అవసరాల కోసం సంకేతాలు తీసుకోవాలంటే ఆ చరిత్రను పురాణీకరించడం అవసరం.

నిన్నటి విప్లవాలు ఈవిధంగా గతచరిత్రను పురాణంగా ట్విస్ట్‌చేసి ప్రజల ముందు ఒకప్రమాణంగా నిలబెట్టడానికి కారణంలేకపోలేదు. ఆ విప్లవాలన్నీ అసమగ్రమయిన విప్లవాలు. సార్వత్రిక మానవఆదర్శంపేరిట పాక్షిక వర్గప్రయోజనాలను సాధించినఉద్యమాలు. 'స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం' అనిప్రకటించి బూర్జువా వ్యాపారస్వేచ్ఛను, పెట్టుబడుల సమానత్వాన్నీ, చేంబర్ ఆఫ్ కామర్స్ సౌభ్రాతృత్వాన్నీ సాధించారు. ఈ ఎడాన్ని కప్పిపుచ్చడంకోసం పురాణాలు అవసరం, బ్రతికున్న వాస్తవాలస్థానాన గతించిన వాస్తవాలనుకాదు, వాటి అందమయిన విగ్రహాలను నిలబెట్టి వాటి పూజను ప్రజలకు పురమాయించడం అవసరం. అచారిత్రికం, ఆలౌకికం, అయిన కల్పితఆదర్శాలు సాధ్యానికీ అసాధ్యానికీ భూమికీ

స్వర్గానికీ సత్యానికీ కల్పనకూ తేడాను తుడిపేసి విచక్షణను చంపేస్తాయి. ఆదర్శాలు పూజార్థమేగాని ఆచరణార్థంకాదనే అబద్ధాల వాతావరణాన్ని కల్పిస్తాయి. దగాను, బూటకాన్ని, క్షమిస్తాయి. హరిశ్చంద్రుడిని ఆదర్శంగా ప్రకటిస్తే అనవసరమయిన అబద్ధాలుగూడ ఆడవచ్చు. హరిశ్చంద్రుడు పుక్కిటిపురాణం అనిప్రకటిస్తే అవసరమయిన అబద్ధాలుగూడ ఆడలేం. దగాచేసే ఉద్దేశ్యంలేనివాళ్ళకు మాత్రమే అసత్యాలతోనూ పురాణాలతోనూ పనిలేదు. వాళ్ళే చరిత్రనుండి పౌరాణిక అంశను పారద్రోలి ఎక్స్ రే కళ్ళతో సత్యాన్ని చూడగలరు. వాళ్లుమాత్రమే తమ సంకేతాలనూ ప్రమాణాలనూ నేటి పోరాటాలనుండి, రేపటిసృష్టినుండి, ఎంచుకుంటారు. స్పార్టకస్ నుండి అల్లూరి సీతారామరాజుదాకా, కొమురం భీముదాకా, ప్రజానాయకులను పురాణపురుషులుగాకాక ఆనాటి సమాజం పరిమితులలో బ్రతికిన మనుష్యులుగాను, ప్రామాణిక ఆదర్శంగాకాక చారిత్రిక ఉత్తేజంగాను, తీసుకుంటారు. చరిత్రలో దేనికీ నగిషీలుచెక్కాల్సిన అవసరం వాళ్ళకుమాత్రమేలేదు. (విప్లవందాకాఎందుకు. ప్రజలునమ్మే అబద్ధాలకుగూడ నగిషీలుండవు. కలవాళ్లదేవుళ్లు మాత్రమే అందంగా ఉంటారు. పోచమ్మ నూకాలమ్మ అందగత్తెలుకారు). చరిత్రలోదేనినీ వికారంగా చూడాల్సిన అవసరంగూడ వాళ్ళకుమాత్రమేలేదు. భవిష్యత్తుపట్ల దురుద్దేశ్యాలు లేకపోతే, 1939-42 కాలంనాటి ప్రపంచపరిస్థితులను ఏకీకరించి, ఆనాడు కమ్యూనిస్టు పార్టీచేసిన పొరబాట్లను వికారమయిన విద్రోహంగా చిత్రించాల్సిన అవసరంగాని, ఆ పొరబాట్ల సరసన అసందర్భంగా మావో అభిప్రాయాలనూ స్టాలిన్ నిర్ణయాలనూ లెనిన్ ఆచరణనూ నిలబెట్టి మొత్తం ప్రపంచకార్మిక ఉద్యమాన్నే దూషించాల్సిన అవసరంగానీ ఆరుణ్ శౌరికి ఉండేదికాదు.

ఈ విషయాలు ప్రజలకు తెలియక పోవచ్చునుగాని పాలక వర్గాలకు బాగా తెలుసు. అందుకే ప్రజలు భవిష్యత్తునుండీ నడుస్తున్న జీవితంనుండీ ఎంచుకున్న సంకేతాలను పురాణీకరించి తమ స్వంతంచేసుకొని తమ ఆదర్శాలుగా ప్రజలముందు ఉంచుతారు. భవిష్యత్తుకు సంకేతమయిన సుత్తీకొడవళ్ల ఐక్యతాచిహ్నం కంటికి కనబడనంత ఎత్తుగా ఎర్రజెండాను ఎగరేసి కార్మిక కర్షక ఐక్యతబదులు కార్మిక యాజమాన్య సౌభ్రాతృత్వాన్ని ప్రచారంచేస్తారు. లెనిన్‌ను విప్లవ కార్మికవర్గ నాయకుడిగాకాక మానవకళ్యాణాన్ని కాంక్షించిన మహనీయుడిగా మహాత్ముల గేలరీలో విగ్రహప్రతిష్ఠాపన చేస్తారు. వాళ్లుకల్పించే పురాణాలగాలంలో కార్మికవర్గం చిక్కుకోవడంకన్న వాళ్ళకు కావలసిందిలేదు. సోషల్‌డెమోక్రాట్లనుండీ రివిజనిస్టులదాకా కార్మికనాయకులంతా చిక్కుకుంటూనే వున్నారు. నిన్నటి మేదేనాడు ఇందిరాగాంధీ

చెర్నెంకోప్‌లు కలిసి అతినూతనంగా సృష్టించిన రాకేశ్‌శర్మ అనే పురాణపురుషుడు భారతజాతి హీరో అవునాకాదా అన్న పౌరాణికచర్చలో అంగీకారంకుదరక సి.పి.ఐ సి.పి.ఎంలు ఢిల్లీలో తాము ఉమ్మడిగా నిర్వహించదల్చుకున్న మేడేర్యాలీని రద్దు చేసుకున్నారట! అమ్మగారూ అయ్యగారూ నవ్వుకుంటున్నారేమోనన్న అనుమానం గూడ మన కామ్రేడ్లకు వచ్చినట్టులేదు. లేక, 'నాకేటిసిగ్గు' అనుకున్నారో.

ఇలాంటి మార్మికతకు లోబడనివాళ్లనుమాత్రం పాలకవర్గాలు క్షమించడం లేదు. ఇవ్వాళ తెలంగాణజిల్లాలలో మేడే జరుపుకోవడమే ఒకనేరం అయిపోయింది. జరుపుకోవాలనుకోవడమే ఒక పోరాటమయింది. పర్మిషన్‌కోసం అడిగినచోట తిరస్కరించడం, అడగకుండ జరుపుకున్నచోట అరెస్టులుచేసి లాకప్పులలో చితగ్గొట్టి ఎగరేసిన ఎర్రజెండాను చింపేసి కసితీర్చుకోవడం, జరుగుతోంది. తమ మాట వినని వాళ్ళంటే కోపమయితే తమ మార్మికతకు లొంగనివాళ్లంటే పాలకవర్గాలకు మరింతద్వేషం. ఆ మొండితనం తమనుకూలుస్తుందని వాళ్ళకు తెలుసుసుకాబట్టి ఆ ద్వేషం సకారణమయినదే.

23-5-84

---

మలయాళీ కవిత

# ముక్తకంఠం

సచ్చిదానందన్

భూమిని దున్నేది మేం
మేమే భూమి
విత్తనాలు నాటేది మేం
విత్తనాలమూ మేమే

మా నాగేటి చాళ్ళలోనే
అనాది దేవత ఉదయించింది
మా కనుబొమల చెమట చుక్కలోనే
తొలిగీతం ఫలించింది
వంగిపోయిన మా వీపులమీదనే
మొట్టమొదటి శిల్పం ఆకృతిపొందింది

ఆకలికి మాడిన మా కడుపుల మీదా,
ఎముకల మీదా
మొట్టమొదటి రాజభవనం నిర్మితమైంది
లోకం ఆకలిని తీర్చిన మాచేతుల్ని
ఇవాళ ఆకలి మొద్దుబార్చింది
తమ సంపద దాచుకునేందుకు
ఎలుకలు
మా గాదెల్ని స్వంతం చేసుకున్నాయి
ప్రపంచానికి వెచ్చదనం అందించిన
మా హృదయాల్ని
పేదరికపు కాటు
నిరుత్సాహంలో ముంచేసింది
ఫలవంతమైన మా పొలాలనుంచి
వేటకుక్కలు మమ్మల్ని తరిమేశాయి

మా వరి పొలాలు పాటలు పాడిన
గంగా తీరాన్ని
వాళ్ళ నల్లమందు చెట్లు ఆక్రమించాయి
మా పంటల సంగీతం
ప్రభవించిన చోట
ముసుగు దయ్యాలు నర్తించాయి
చెరుకు తోటల్లో రాగాలు పలికించే
మా ఋతుపవనాల్ని వాళ్ళెత్తుకుపోయారు
[illegible]ర్రింలా నకిలించే
వాళ్ళు
తమ బంగారు కళ్ళాలతో
అదిమి పెట్టారు.

అప్పుడు మేం
నాలుగు దుర్భర పర్వతాలనీడలో
బతుకు వెళ్ళదీయవలసి వచ్చింది
ఆ మాడ్చేసే పర్వతాల వేసవికాలంలో
పచ్చని మాజీవన స్రవంతులు ఇంకి
పోతాయి

ఒకప్పుడు బంగరు పంటలు కోసిన
కొడవలి
ఇవాళ
రైతులు తిరస్కరించే
విషపూరిత శిరసుల్ని చెలగివేస్తుంది
ఒకప్పుడు
కటికరాతినేల విరగ్గొట్టిన నాగటికర్రి
ఇవాళ
కాడిని పెంచిపోషించే రాతిగుండెల్ని
పగల దీస్తుంది

ఉలీ కత్తీ
మనిషి సగర్వ చిత్రాన్ని చెక్కుతాయి
విజయారుణాలయ నాదాన్ని
తంబురా కొమ్ముబూరా కూరుస్తాయి

## 2

పనిముట్లను తయారుచేసింది మేం
మేమే పనిముట్లం
చక్రాలను నడిపేవాళ్ళం మేం
చక్రాలమూ మేమే

మొట్టమొదటి సముద్రయానపుతెరచాపల్లో
నిండినవి మాజీవన శ్వాసలే
మాకండరాల బలోద్వేగాల మీదనే
తొలినగరం నిర్మాణమయింది
మాకన్నీళ్ళ సముద్రాల మీదనే
దేశాల వాణిజ్యం మొదలైంది
తగులబడిపోయిన మాఆకాంక్షల మీదనే
మొట్టమొదటి సామ్రాజ్యం వర్ధిల్లింది
అడవిలో తోడేలు పంటిగాటుకు
రక్తమోడుస్తూ మేం పరుగెత్తుకొస్తాం
పాము పడగలతో విషపూరితమైన
కలలతో మేం మేలుకుంటాం
మాపిల్లల్ని మింగేసే తిమింగిలం పొట్టని
మేమివాళ చీల్చేస్తాం
క్రూరమైన రాత్రులరాబందుపంజాలమీద
మేం పోరాడుతాం

రాక్షసయంత్రాలు మానెత్తుటిని
చివరి బొట్టుదాకా పీల్చేస్తాయి
వాళ్ళ తొత్తులు
మానోటికాడి ముద్ద దొంగిలిస్తారు
మాకూతుళ్ళను చెరుస్తారు
మాకాళ్ళకు సంకెళ్ళేస్తారు

రంగులద్దిన వాళ్ళకిటికీ నీడలోంచి
మా చేతులు, మా ఉత్పత్తులు
మాకేసి తేరిపారజూస్తాయి
నిష్ఫలాకాంక్షలతో మాపిల్లలు
తమ తండ్రులు చేసిన
బొమ్మలవైపు తొంగి చూస్తారు

నాలుగు భయంకర పర్వతాల
లోయలో మేం నివసించాల్సి వస్తుంది
ఆపర్వతాల ఎముకలుకొరికేచలికాలంలో
మాజీవితాల నిండుకునే
ఆశల ఊటలు గడ్డకడుతాయి

ఒకప్పుడు
లొంగని ఇనుము గర్వాన్ని
అణచేసిన సుత్తె
ఇవాళ
బలుస్తూ విస్తరిస్తున్న
పెట్టుబడి వేలాది పడగల్ని
చితగ్గొడుతుంది
మన సూరీని చుట్టూ
పొంచికూచున్న మృగాల్ని వేటాడడానికి
శ్రమించే కండలివాళ
తుపాకిని చేజిక్కించుకుంటాయి

గోధుమలు విసిరే మరలే
కాలాన్ని నడుపుతాయి
ఉక్కుకు రూపమిచ్చేదిమ్మలే
మన జీవితాల్ని మలుస్తాయి

[ఎఐఎల్ఆర్సి ప్రచురణ 'హెయిల్ రెవల్యూషన్' నుంచి అనువాదం]

రష్యన్ కథ :

# ద్వేషం

మిఖయీల్ షొలఖొవ్

సోవియట్ రచయిత షొలఖొవ్ రెండో ప్రపంచ యుద్ధకాలంలో సైన్యంలో పనిచేసిన సంగతి గతసంచికలో రాశాం. ఆయన యుద్ధరంగంనుంచి ఈ కథరాశారు. 1942లో ఈ కథను, డౌన్ సౌత్ అనే మరో కథను కలిపి మాస్కో విదేశభాషా ప్రచురణాలయం వాళ్ళు ఇంగ్లీషులో వేసారు. ఆ తర్వాత ఈ కథ ఎక్కడయినా అచ్చయించేమో తెలియదుగాని రష్యావాళ్ళు వేసిన ఏ షొలఖొవ్ సంకలనంలోనూ లేదు. ఇంగ్లీషునుంచి ఈ కథను అనువదించాం.

— 'సాహితీ మిత్రులు'

"....నీ గుండె లోలోతుల్నుంచీ నీ శత్రువును
ద్వేషించడం నేర్చుకోకపోతే నువ్వువాణ్ని ఓడించలేవు"

—మేడే ఉపన్యాసంలో స్టాలిన్

యుద్ధసమయంలో ప్రజలూ ఙలవుతారు, చెట్లుకూడ బలవుతాయి. మా ఫిరంగిదళాలు ఓ విస్తారమైన అరణ్యప్రాంతాన్ని నేలమట్టంచేశాయి. ఈ మధ్యనే ఓ ఊళ్ళోనుంచి తరిమేయబడ్డ జర్మన్లు ఈ అడవిలోనే తలదాచుకున్నారు. అక్కడ ఎంతో కాలం ఉండగలవని వాళ్ళు ఆశపడ్డారు. కాని మృత్యువు ఆ చెట్లతోసహా వాళ్ళను నరికేసింది, విరిగిపోయిన దేవదారు చెట్లకాండాలకింద జర్మన్ల శవాలు నలిగిపోయాయి. తుంపులయిపోయిన వాళ్ళశవాలముక్కలు నేలమీద పచ్చనినాచులో, పాచిలో కుళ్ళిపోయాయి. దేవదారు వృక్షాలకాండాలకు తుపాకీగుళ్ళుచేసిన రంధ్రాల జిగురువాసన వస్తోంది, కుళ్ళిపోతున్నశవాలనుంచి ముక్కలుబద్దలుగొట్టే, అసహ్యకరమైన దుర్వాసనలేస్తోంది. జిగురువాసన శవాంవాసనని ఆడ్డుకోలేకపోతోంది. మా తుపాకీ గుళ్ళతో మాడిపోయి, గుల్లలుపడిన పేడరంగునేలకూడ శ్మశానం వాసనను వెదజల్లుతోంది. మా తుపాకులు నరికి దున్నిన ఆ అడవి నేలమీద మృత్యువుమౌనంగా తీవిగావీస్తోంది.

ఆ మొత్తం నేలచెక్కమధ్యలో ఒక ఒంటరి బిర్చ్‌చెట్టుఉంది. అది ఏదో అపూర్వశక్తితో నాశనంకాకుండా నిలిచిపోయవట్టుంది. అక్కడ మందంగావీస్తున్న గాలి చీలిపోయిఉన్న ఆ చెట్టుకొమ్మల్ని ఊపుతూ, ఒకదానికోటి అతుక్కుపోయిన లేత, నునుపైన ఆకుల్తో గుసగుసలాడుతోంది.

మేం ఆ నేలచెక్క మీద నడుస్తున్నాం. మాముందర ఓ యువసిగ్నలర్ నడుస్తున్నాడు. ఆయన ఆ బిర్చ్ చెట్టుకాండాన్ని మృదువుగా నిమిరాడు. నిజాయితీ, ప్రేమా నిండిన గొంతుతో ఆశ్చర్యంగా ఆయన "నా బంగారూ, ఇంత గందరగోళంలో నివ్వెట్లాబతికి బైటపడ్డావురా?!" అన్నాడు.

దేవదారుచెట్టయితే ఎక్కడ ఒక్క తుపాకిగుండు తగిలినా కొడవలిలో మొదట్లో నరికేసినట్టు ఎండిపోయి, కుప్పకూలిపోతుంది. కాని ఓకుచెట్టుమాత్రం అంత సులభంగా చచ్చిపోదు. ఓ పేరులేని సెలయేరుతీరానఉన్న ఓ ఓకుచెట్టు కాండంలోకి జర్మన్ తుపాకిగుండు దూసుకుపోయింది. ఆవులించినట్టు తెరుచుకున్న ఆ అస్తవ్యస్తపుగాయం చెట్టులోంచి సగంప్రాణాన్ని తినేసింది. కాని మిగతాసగం నీటివైపు ఒంగి వికసించి, వసంతకాలంరాగానే అద్భుతంగా ప్రాణంపోసుకుని, నిండా మారాకు వేసింది. ఇవాల్టికికూడ ఆ చెట్టులో చెడిపోయినకొమ్మ ఆ సెలయేట్లో తడుస్తూనేఉంది. మరోకొమ్మ ఉలుల్లాంటి తనఆకుల్ని ముడుచుకోవడానికి మారాం చేస్తూ ఆకాశంలోకి తలెత్తి సూర్యరశ్మిలోకి తొంగిచూస్తోంది.

* * * *

లెఫ్టినెంట్ గెరాసిమోవ్ మాకు తనకథ వినిపిస్తున్నాడు. ఆయన కొంచెం పొడగరే, గూనిసింది, ఎత్తుగా, వెడల్పుగా ఓ గాలిపటంలా కనబడేభుజాలతో గెరాసిమోవ్ మా కందకం మొదట్లోకూచుని ఆరోజు వాళ్ళ బెటాలియన్ శత్రువు ఫిరంగిదాడిని ఎలా ఎదుర్కొందో ఉత్సాహంగా చెప్పుకుపోతున్నాడు.

ఆయన కోలముఖం ప్రశాంతంగాఉంది. దాదాపు నిర్లిప్తంగాఉంది. జ్వలిస్తున్నట్టున్న ఆయన కళ్ళచుట్టూ అలసటతో ముడతలుపడ్డాయి. తనపెద్ద,మోటైన వేళ్ళను అప్పుడప్పుడు ముడివేసుకుంటూ ఆయన సన్నగా మాట్లాడుతూపోయాడు. దృఢమైన ఆయన ఆకారం, ముఖవర్చస్సు, పదాల్లో వివరించలేనివేదన, లోతైన, హృదయవిదారకమైన దీర్ఘచింత- వీటిపట్ల ఆసక్తి కలగకుండా ఉండడం అసాధ్యం.

చెప్తూచెప్తూ హఠాత్తుగా ఆయన మాటలు ఆపేశాడు. ఆయనముఖంలో మార్పు వచ్చింది. ఆయన చామనచాయ చెంపలు పాలిపోయాయి. చెంపల ఎముకలకింద కండరాలు దవడల్లోకి తోసుకుపోయాయి. ఎదురుగా తీక్షణంగా చూస్తున్నకళ్ళు భయంకరంగా ఆరిపోనిద్వేషంతో జ్వలించాయి. నేనూ అనుకోకుండానే ఆయన చూపులు పాకినవేపు దృష్టిసారించాను. అక్కడ ముగ్గురు జర్మన్ ఖైదీల్ని నడిపించుకు

పోతున్నారు. చెట్లమధ్యనుంచి, రక్షణరేఖమీదుగా వాళ్ళను ఓ ఎర్రసైనికుడు నడిపించుకు పోతున్నాడు. ఆ ఎర్రసైనికుడు వేసుకున్న వేసవి యూనిఫాం రంగు మాసిపోయి తెల్లగా కనబడుతోంది. ఆయన టోపీ తలవెనక్కి వేలాడుతోంది.

వాళ్ళ వెనుక ఎర్రసైనికుడు నింపాదిగా నడుస్తున్నాడు. ఆయన భుజానికి వేలాడుతున్న రైఫిల్ సన్నీ ఎండకు తళతళలాడుతోంది. జర్మన్లుకూడ నెమ్మదిగా నడుస్తున్నారు. పసుప్పచ్చ బురదఅంటిన బూట్లనుఈడుస్తూ వాళ్ళు అతిమెల్లగా సాగుతున్నారు.

అందరికంటె ముందున్న జర్మన్ మిగిలినవాళ్ళకన్న పెద్దవాడు. లోతుకుపోయిన చెంపలతో, బిరుసుగడ్డంతో ఉన్నాడు. కందకంపక్కనుంచి వెళ్ళేటప్పుడు మావైపు ఎర్రగా తోడేలుచూపులు చూశాడు. బెల్ట్‌తోకలిపిఉన్న హెల్మెట్‌ను సరిచేసుకున్నాడు. వెంటనే గెరాసిమోవ్ ఎర్రసైనికుడిదగ్గరికి పరుగెత్తి 'ఏం చేస్తున్నావు నువ్వు? వాళ్ళను షికారు తీసుకెళ్తున్నావా ఏం? కొంచెం చురుగ్గా నడవలేవూ' అని గద్దించాడు. ఇంకేదో అందామనుకున్నట్టున్నాడుగాని కోపంతో కంఠంపొరబోయింది. గిరుక్కున వెనక్కితిరిగి కందకంలోకి పరుగెత్తుకొచ్చాడు. అప్పుడు మా రాజకీయ కమిస్సార్ అక్కడేఉన్నాడు. నేనాయనవేపు ప్రశ్నార్థకంగా చూసాను. "ఏమీ లాభంలేదు, మనమేంచెయ్యలేం. కొంచెం ఉద్రేకంలోఉన్నాడు. నీకుతెలీదా, జర్మన్లు ఆయన్ని ఖైదీగాపట్టుకెళ్ళారు. నువ్వోసారి ఆయనతో మాట్లాడాలిలే.... అక్కడ ఆయన్ని చెప్పరాని బాధలకెరజేశారు, ఆ తర్వాతనుంచీ బతికిఉన్న జర్మన్‌ను చూసాడంటే అంతే. జర్మన్‌ల శవాలనుచూస్తే ఫరవాలేదు. బహుశా అప్పుడు తృప్తిగాఉంటాడనుకుంటా. కాని జర్మన్ ఖైదీల్ని చూశాడంటేమాత్రం కళ్ళుమూసుకొని నిశ్చలంగా మండిపడుతూ, కోపంలో చనిపోయినమనిషిలాగా పాలిపోయి కూచోనన్నా కూచుంటాడు. లేదా పరుగెత్తి మనసులోఉన్న కసిఅంతా తీర్చుకోనన్నా తీర్చుకుంటాడు. నేనాయనతో రెండుసార్లు యుద్ధరంగంలోకి వెళ్ళాను. ఆయనకు గుర్రానికున్నంత శక్తిఉంది. ఆయనెట్లా పోరాడుతాడో నువు చూసితీరాల్సిందే.... నేనైనా కొన్నిసార్లేచూసాను. ఆయన తుపాకీమడమతోటీ, బయనెట్‌తోటీ ఎలా పొడుస్తుంటాడో ఆదృశ్యం నిజంగా భయంకరంగా ఉంటుందనుకో...." అని మా కమిసార్ నా చెవిలో గుసగుసలాడాడు.

*     *     *     *

ఆ రాత్రి జర్మన్ భారీఫిరంగిదళం చిరాకెత్తే కాల్పులుజరిపింది. అప్పు డప్పుడు దూరానెక్కడో టకటకమని చప్పుడు వినబడుతుంది. దానివెనుక కొద్ది సెకన్లకే చుక్కలు నిండినఆకాశంలో హిస్సుమంటూ తూటాలు దూసుకుపోతున్న శబ్దంవస్తుంది. ఆ చప్పుడు ఓ కేకలామారి కొంతసేపటికి మా వెనకెక్కడోక్రమంగా అదృశ్యమై పోతుంది. ఉదయంపూట ట్రక్కులనిండా ఆయుధాలుసాగే రహదారిమీద పడి పసుప్పచ్చని మంటనూ, మేఘగర్జనలాంటి చప్పుడునూ సృష్టిస్తుంది.

ఈ పేలుళ్ళమధ్య అడవిమీద నిశ్శబ్దం పరచుకుంటుంది దోమల సన్నని సంగీతమూ, పక్కనున్న బురదగుంటలో భయపడుతున్నట్టు అప్పుడప్పుడుకప్పల బెక బెకలూ ఆ నిశ్శబ్దాన్ని భగ్నంచేస్తాయి. అలాంటప్పుడు ఓ అడవిపొదకింద మేం పడుకుని ఉన్నాం. గెరాసిమోవ్ నింపాదిగా తనకథచెప్తున్నాడు. మధ్య మధ్య ఓ కొమ్మవిరిచి దోమలు తోలుతున్నాడు. ఆయన కథనునాకుగుర్తున్నంతవరకూ ఆయన మాటల్లోనే వినిపిస్తాను.

"యుద్ధానికిముందు పశ్చిమసైబీరియాలో ఓ మిల్లులో మెకానిక్‌గా పనిచేస్తుండే వాణ్ని నేను. పోయినసంవత్సరం జులై తొమ్మిదిన నన్నుయుద్ధంలోకి పిలిచారు. నాకో చిన్నకుటుంబం ఉండేది, నాభార్య, ఇద్దరు చిన్నపిల్లలు, జవసత్వాలుడిగి పోయిన మానాన్న. సరే. మామూలుగానే నన్నుపంపించేప్పుడు మా ఆవిడకొంచెం ఏడ్చింది. నాకేదోవోటి చెప్తూనేఉంది. 'నీ దేశాన్నీ, నీ జనాన్నీ చివరిదాకా కాపాడు. అవసరమైతే ప్రాణం పణంగాపెట్టడానికైనా వెనుకాడకు. మొత్తానికి మనంగెలవాలి'. అంటూ ఏదో చెప్తూపోయింది. నాకుబాగాగుర్తు, నేనామాటలకునవ్వి "నువు ఎవరినను కుంటున్నావ్? నాభార్యవా, కార్యకర్తవా? నేనెవరినో నాకుతెలుసు. ఇక విజయ మంటావా, మేం ఫాసిస్టులగొంతుకు ఉరిబిగించి విజయం సాధించుకొస్తాం. తెలిసిందా." అన్నాను.

మానాన్న కాస్తగట్టివాడే. కాని ఆయనకూడ నేనువచ్చేప్పుడు కొన్నిసలహా లిచ్చాడు. 'విక్టర్, విను. గెరాసిమోవ్‌లంటే మామూలువాళ్ళుకారు. నువ్వు కష్ట జీవుల వంశంలో మనిషివి. నీ ముత్తాత స్ట్రొగనోవ్‌కోసం పనిచేశాడు. మన కుటుంబం వందలసంవత్సరాలుగా దేశంఇనుమును ఉపయోగకరంగా కరగబోస్తోంది. ఈ యుద్ధంలో నువు ఇనుములాగ ప్రవర్తించాలి. ఇప్పుడు మనప్రభుత్వాన్ని మనమే తయారుచేసుకున్నాం. యుద్ధానికన్నముందే మనప్రభుత్వం నిన్ను రక్షణదళాల కమాండర్‌గా చేసింది. శత్రువుకు గట్టిగా, సరిగ్గాబుద్ధిచెప్పి నువ్వాబాధ్యతనెరవేర్చాలి.'

'తప్పకుండా మా బాధ్యతలు నెరవేరుస్తాం నాన్నా' అని నేను జవాబిచ్చాను.

స్టేషన్‌కు వెళ్తూ వెళ్తూ నేను జిల్లా పార్టీ కేంద్రానికి వెళ్ళాను. మా కార్యదర్శి మొఖంలో ఏ భావాలు కనిపించవు. మొరటుమనిషిలా కనిపిస్తాడు. అన్ని విషయాలు సకారణాలతో ఆలోచించి ఉన్న విషయం బొటాబొటి మాట్లాడేవాడు. సరే, నా భార్యా, నాన్నా కూడ సలహాలిచ్చినప్పుడు ఈయన ఇవ్వకుండా ఉంటాడా, ఓ అరగంటసేపు ఈయన ఉపన్యాసం వినక తప్పదు. అనుకుంటూ లోపలికి వెళ్ళాను. కాని అందుకు పూర్తిగా వ్యతిరేకంగా జరిగింది. 'కూచో గెరాసిమోవ్. మన వెనుకటివాళ్ళు ప్రయాణానికి ముందు ఓ నిమిషమో రెండు నిమిషాలో స్థిమితంగా కూచునేవాళ్ళు కాదూ.' అన్నాడు.

అలా మేం కాసేపు నిశ్శబ్దంగా కూచున్నాం. ఆయన లేచి నిలబడ్డప్పుడు ఆయన కళ్ళద్దాల వెనుక ఏదో అలుక్కుపోతున్నట్టు నేను గమనించాను. అరె, ఇవాళ అద్భుతాలు జరుగుతున్నాయే అనుకున్నాను.

'కామ్రేడ్ గెరాసిమోవ్. చెప్పడానికి పెద్దగా ఏమీ లేదు. పయనీర్ ఎర్ర రుమాలు చుట్టుకొని చెవులు వేలాడుతూ యువకుడుగా ఉన్నప్పటి నీ రూపు నాకు గుర్తుంది. ఆ తర్వాత నిన్ను నేను లీగ్ సభ్యుడిగా చూశాను.... ఆ తర్వాత సుష్ఠ నాకు పదేళ్ళుగా పార్టీసభ్యుడిగా కూడ తెలుసు. కామ్రేడ్, ఆ జర్మన్ పందులపట్ల ఏ మాత్రమూ జాలి చూపకు. పార్టీ నీమీద విశ్వాసముంచుతోంది" అన్నాడాయన.

నా జీవితంలో మొదటిసారి మేమిద్దరమూ పాత రష్యన్ సాంప్రదాయంలోలాగ ముద్దుపెట్టుకున్నాం. ఎందుకోగాని అప్పుడు ఆ కార్యదర్శి మామూలుగా మొరటు ముసలాడిలాగ కనిపించలేదు.

ఆయన నాపై చూపిన ప్రేమతో నేను కదిలిపోయాను. ఆ ఆనందంలో తల మునకలవుతూ నేను జిల్లాకమిటీ కార్యాలయంనుంచి బైటపడ్డాను

మా ఆవిడ కూడ నాకెంతో ప్రోత్సాహమిచ్చింది. ఎవరి భార్యకయినా ఇలాంటి పరిస్థితి ఏడుపు తెప్పిస్తుంది కదూ, యుద్ధంలోకి భర్తను స్వయంగా పంపడానికి ఎవరికి మాత్రం చేతులొస్తాయి? మా ఆవిడ కొంచెం ఆందోళన పడినమాట నిజమే. ఏదో ముఖ్యమైన విషయం చెప్దామని చాలసార్లు అనుకున్నట్టుంది, కాని ఆమె బుర్రంతా శూన్యమైపోయింది. అప్పటికే రైలు కదలడం మొదలయింది. నా చేతిని గట్టిగా

పట్టుకొని తను రైలుపక్కనే పరుగెత్తుకొస్తూనేఉంది. పదే పదే 'జాగ్రత్త విట్యా, ఆరోగ్యం జాగ్రత్త. అక్కడ జలుబుతెచ్చుకోకు' అని చెప్తూనేఉంది. 'మంచిది, నేనింకా చిన్నపిల్లాణ్ననుకుంటున్నావా ఏం? అక్కడ వాతావరణం వెచ్చగా ఉంటుందిలే, జలుబురాదు. నాడియా జాగ్రత్త" అని ఏదో జవాబిస్తున్నానేగాని ఆమెను వదిలిపోతున్నందుకు నా గుండెలు పిండేస్తున్నంత బాధకలుగుతోంది. అర్థం లేనిపైనా, ఆమెచెప్తున్న తియ్యని చిన్నచిన్నవిషయాలకు ఆనందమూ కలుగుతోంది. అప్పుడీక జర్మన్లమీద విపరీతమైనకోపం నన్ను ఆవహించింది, 'నిన్నేంచేస్తామో చూసుకో, వెధవా, నీప్రాణాలు తోడేస్తాం' అనుకున్నాను....

గెరాసిమోవ్ కొద్దినిమిషాలు నిశ్శబ్దంగా కూచున్నాడు. మా ఎదురుగా యుద్ధ రంగం వైపునుంచి ఆగకుండా మెషిన్‌గన్‌మోత వినిపించింది. ఆమోత ఎంత అనూహ్యంగా మొదలయిందో అంతే అనూహ్యంగా ఆగిపోయింది. మళ్ళీ ఆయన చెప్పడం మొదలెట్టాడు.

యుద్ధానికిముందు మా పనిముట్లు జర్మనీనుంచి వచ్చేవి. వాటిని జతచేసేప్పుడు మేం ఒక్కొక్కభాగాన్నీ అటుతిప్పీ ఇటుతిప్పీ అన్నివైపులాచూపి ఐదారుసార్లు పరీ క్షించడం నాకింకాబాగాగుర్తు. ఆ యంత్రాలను మంచినైపుణ్యంగల చేతులు తయారు చేసాయనడంలో ఏ సందేహమూ ఉండేదికాదు. నేనప్పుడు జర్మన్‌రచయితల పుస్త కాలు చదవడంకూడ మొదలెట్టాను. మొత్తానికి నేను జర్మన్‌ప్రజల్ని అభిమానించే దాకు వచ్చాననన్నమాట. అంతనైపుణ్యమూ, దీక్షఉన్న ఆ ప్రజలు అసహ్యకరమైన హిట్లర్ పాలనలో ఎలామగ్గిపోతున్నారా అని నేను కొన్నిసార్లు ఆశ్చర్యపోయేవాణ్ని. కాని, అదేదో వాళ్ళసొంతగొడవ. అప్పుడిక పశ్చిమయూరప్‌లో యుద్ధం మొదలయింది.

సరే, నేను యుద్ధరంగానికి వెళ్ళేటప్పుడు నన్నీఆలోచనలే ముసురుకున్నాయి. వాళ్ళకు మంచిసైన్యంఉంటుంది. వాళ్ళు సాంకేతికపద్ధతుల్లో నిపుణులయిఉంటారు. అనుకున్నాను. ఐతే యుద్ధరంగంలో నిజంగా ఎదురుబొదురుగా నిలబడ్డప్పుడుమాత్రం అవతలివాడి పక్కటెముకల్లో మనకత్తి ఎట్లాగుచ్చాలా అనేదే ఆలోచించాల్సివస్తుంది. 1941లో మనంకూడ తీసికట్టుగా ఏమీలేం. శత్రువుకు నీతినిజాయితీ ఉంటాయని నేననుకోలేదనుకో, ఫాసిజంనుంచి అలాంటివి ఊహించలేంగదా. కాని యుద్ధం చెయ్యబోయేముందు జర్మన్లు అంత నీతిలేని వెధవలుగా ఉంటారని నేను ఊహించ లేదు. ఆసంగతి తర్వాతచెప్తాను.

జులై చివరికల్లా మా యూనిట్ యుద్ధరంగం చేరింది. ఇరవైఏడో తారీఖు పొద్దున్నే మేం యుద్ధంమొదలుపెట్టాం. కొత్తకావడంతో మొదట అదికొంచెం భయం గొలిపింది కందకాల ఫిరంగులతో జర్మన్లు మొదట మాకుకొంచెం ఇబ్బందులు కలిగించారు. కాని సాయంత్రానికల్లా మాదే పైచేయిఅయింది. వాళ్ళను కాస్త వెనక్కికొట్టాం. వాళ్ళను ఓడించినుంచితరిమేశాం. ఆరోజుల్లో మేమో పదిహేనుమంది జర్మన్లను పట్టుకున్నాంకూడా. ఆ సంగతంతా ఇప్పుడే జరిగినట్టు నా కళ్ళముందు ఆడుతోంది. ఆ జర్మన్లు భయంతో పాలిపోయికనిపించారు. వాళ్ళందర్నీ లోపలికి పట్టుకొచ్చేటప్పటికే మావాళ్ళు కాస్తచల్లబడ్డారు. తమదగ్గరేముంటే అది ఖైదీలకు తినడానికి పెట్టారు, కొందరు పొగాకుకాడ పంచుకున్నారు. మరి కొందరు చుట్ట లిచ్చారు. కొందరు టీ పోశారు. అలా మా వాళ్ళు ఖైదీల భుజాలమీదచరిచి "కామ్రేడ్స్, అసలు మీరెందుకు యుద్ధంచేస్తున్నారు" అన్నారు. అలాంటి విషయాలెన్నో అడిగారు.

మమ్మల్నందరినీ కదిలించిన ఈదృశ్యం మాలోఒకర్ని ఏమాత్రమూ కదిలించ లేక పోయింది. చాలఏళ్ళుగా సైన్యంలోపనిచేస్తున్న ఆయన కాసేపు ఈదృశ్యం చూసి 'కొత్తదోస్తులమీద చొల్లుకార్చడం ఇంకచాలు, ఇక్కడందరూ కామ్రేడ్లే కాని ఆ సరిహద్దుఅవతల వాళ్ళేంచేస్తున్నారో చూడండి. మన క్షతగాత్రులనూ, మామూలు జన్నానీవాళ్ళెట్టా చూస్తారో గమనించండి....' అని అరిచాడు. మా ఆనందోత్సాహాల మీద చల్లనీళ్ళు కుమ్మరించినట్టుచేసి ఆయనవెళ్ళిపోయాడు.

తర్వాత కొద్దికాలానికే మాదళాలుదాటి ప్రారంభించాయి, అప్పుడుగాని సరిహద్దు అవతల ఏం జరుగుతున్నదో మాకుతెలిసిరాలేదు, అక్కడ ఊళ్ళకూళ్ళనే నేలమట్టం చేసారు, వందలాదిమది ఆడాళ్ళను, పిల్లల్ని, ముసలాళ్ళని చంపేశారు, ఖైదీలుగా పట్టుబడ్డ ఎర్రసైనికుల మృతదేహాలు అక్కడ చెల్లాచెదరుగా పడిఉన్నాయి, వయసు మళ్ళినస్త్రీలను, యువతులనూ, చివరికి చిన్నపాపల్నికూడచెరిచి అతిరాక్షసంగా చంపేశారు.

ఒక సంఘటన మాత్రం నామనసులో నిలిచిపోయింది, ఓపదకొండేళ్ళపాప బహుశా ఆపాప బడికెళ్తూఉండగా జర్మన్లు పట్టుకొనిఉంటారు, ఆపాపను పక్కనున్న ఓతోట లోకి ఈడ్చుకెళ్ళారు, చెరిచిచంపేశారు, ఆతోటలో నలిగిపోయిన బంగాళాదుంపల పొట్టుపడిఉంది, ఆచెత్తాచెదారం మీద ఆఅమ్మాయి....ఆచిన్నపాప....ఇంకాబొడ్డూడని

ఆ పసికూన పడిపోయిఉంది. ఆపాపచుట్టూ పుస్తకాలు చెల్లాచెదరుగా పడిఉన్నాయి. ఆపాప రక్తంమరకలు ఆపుస్తకాల మీద చిందిఉన్నాయి. ఆ చిన్నారిముఖం భయం గొలుపుతోంది. కత్తితో ఆముఖం వింఢాగాట్లుపెట్టారు. ఆపాపఇంకా ఒడిసంచిగట్టిగా పట్టుకునేఉంది. ఆసంచికాస్త తెరుచుకొని కనబడుతోంది. మేం ఆపాపమీద ఓగుడ్డ కప్పేసి, శవంపక్కన ఒకటి రెండు నిమిషాలు మౌనంగా నిలబడ్డాం. తర్వాత అంతే మౌనంగా అక్కడ్నించి కదిలిపోయాం, నా కాళ్ళక్కడ నేలలోపాతుకు పోయినట్లని పించింది. నేనక్కడ్నించి కదలలేకపోయాను. నాలోనేనే ఒకరకమైన మగతలో బార్కొవ్, పొలొవింకిన్; ఉన్నత పాఠశాలల భౌతిక భూగోళం' అనిగొణుక్కున్నాను ఆ గడ్డిలో పడిఉన్న పుస్తకాల్లో ఓపుస్తకంపేరది, ఆపుస్తకం నాకంతకుముందే తెలుసు నా చిన్నారి పాపకూడ ఐదో తరగతే, ఆ పుస్తకమే చదువుతోంది.

ఈ సంఘటన జరిగింది రుజిన్‌దగ్గర. స్క్వేరిలో ఓసందులో ఈదారుణం జరిగింది. ఖైదీలుగా పట్టుబడ్డ ఎర్రసైనికుల్ని చిత్రహింసలు పెట్టిచంపేసిందిక్కడే. నువు ఎప్పుడయినా కసాయి దుకాణంలోపలికెళ్ళిచూశావా? కసాయిదుకాణం ఎలాఉంటుందో తెలిస్తే ఆప్రాంతం ఎలా ఉందోకొంచెం అర్థమవుతుంది.

ఆ సందులో చెట్లకొమ్మలకు రక్తంచారికలుకట్టిన మొండాలు వేలాడుతున్నాయి. ఆ మొండాల కాళ్ళుచేతులూ నరికేశారు. సగంతోలు వలిచేశారు. ఆసందుచివర ఇంకో ఎనిమిది మృతదేహాలు ఓకుప్పేసిఉన్నాయి. ఆ అవయవాలు ఏ మనిషివో ఆనవాలు పట్టలేకుండా తెగ్గొట్టిఉన్నాయి. అదంతా పెద్దపెద్ద ముక్కలుగా తరిగిన మాంసంముద్ద. ఆ మాంసంకుప్ప మీద ఎనిమిది ఎర్ర పళ్ళేలుపెట్టారు. ఓ దాంట్లోకి ఓటిజోడించి పళ్ళెల్లాగపెట్టిన అవేమిటోతెల్సా? ఎర్రసైనికుల టోపీలు....

నేను చూసిందంతా మాటల్లో చెప్పగలుగుతున్నాననుకుంటున్నావా? లేదు లేదు, అసాధ్యం, ఆ దురంతాలనువర్ణించడానికీ భాషలో మాటలుసరిపోవు. స్వయంగా కళ్ళారా చూడాల్సిందే. సరే, మనమిక విషయం మార్చాల్సి ఉందనుకుంటాను" అని గెరాసి మోవ్ మాట్లాడకుండాకూచున్నాడు.

"సిగరెట్ తాగొచ్చునా ఇక్కడ? అని అడిగాను.

"తాగొచ్చు కాని వెలుగుకనబడనివ్వొద్దు," అని ఆయనకంఠం గద్గదంగా విని పించింది, తానుకూడ సిగరెట్ వెలిగించుకొని ఆయన మళ్ళీ చెప్పడం మొదలెట్టాడు.

జర్మన్ల పాశవికత్వం చూశాక మా రక్తం ఉడుకెత్తింది. మీరు అర్థంచేసుకోగలరు గదూ. మేం కోపంతో మండిపోకతప్పదిక మేం పోరాడుతున్నది మనుషులతో కాదనీ పచ్చినెత్తురుతాగే రాక్షసులతోననీ మాకందరికీ తెలిసిపోయింది. వాళ్ళు ఒకప్పుడు ఎంత నైపుణ్యంతో పనిముట్లు తయారుచేసేవాళ్ళో అంతే నైపుణ్యంతో మాప్రజల్ని చంపుతారనీ, చెరుస్తారనీ మాకు అర్థమైంది. అప్పుడు మేం కొంచెం వెనుకడుగు వేయాల్సి వచ్చినా అలాపట్టువదలకుండా పోరాడుతూనేపోయాం.

నా కంపెనీలో ఉన్నవాళ్ళందరమూ సైబీరియా వాళ్ళమే. ఉక్రేనియా నేలలో ప్రతి అంగుళం కోసం మేం భీకరపోరాటం సాగించాం. మాప్రాంతం వాళ్ళెంతో మంది ఉక్రెయిన్‌లో ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఐతే జర్మన్లు అందుకు తగిన ప్రతిఫలం చెల్లించాల్సి వచ్చింది. అప్పుడు మేం ఆప్రాంతంలో బలహీనంగా ఉన్నప్పటికీ జర్మన్లు మాత్రం ఉండలేని పరిస్థితి కల్పించాం.

అప్పుడు గెరాసిమోవ్ సిగరెట్ ఒకటి రెండు దమ్ములులాగి గొంతు సవరించుకొని మళ్ళీ చెప్పడంమొదలెట్టాడు.

ఉక్రెయిన్‌లో నేల చాలబావుంటుంది. పరిసరాలు ఎంత అందంగా ఉంటాయో. అక్కడి ప్రతి ఊరూ, ప్రతి పల్లే మాకెంతోదగ్గరగా, ఆత్మీయంగా కనిపించాయి. ఆ ఊళ్ళని, ఆ పల్లెల్ని రక్షించడానికి మేం మారక్తాన్ని పణంగాపెట్టాం గనుకనేమో. నీళ్ళకంటె రక్తంచిక్కన అంటారుగదూ. ఆఊళ్ళలో ఒక ఊరిని విడిచివచ్చేటప్పుడు మాగుండెలు పిండేసినట్టైంది, ఎంత వేదననుభవించామో చెప్పలేను. ఎంతవిచారం కలిగిందో. తాత్కాలికంగా అయినా మేం ఓ ప్రాంతాన్ని విడిచేసి పోతున్నందుకు, నిరాకరించి పోతున్నందుకు మేం బాధతో ఒణికిపోయాం. మేం అప్పుడు ఒకరి కళ్ళలోకి మరొకరం సూటిగా చూసుకోలేకపోయాం.

నేను జర్మన్‌లకు పట్టుబడి ఖైదీనవుతానని అప్పుడెంతమాత్రమూ ఊహించలేకపోయాను. కానిచివరికదే జరిగింది. సెప్టెంబర్‌లో నేను మొదటిసారి గాయపడ్డాను. ఐనా నేను మాకంపెనీతోనే ఉండిపోయాను. ఇరవైఒకటో తారీఖున నాకు మళ్ళీ పెద్ద గాయమయింది. పోల్తావా ప్రాంతంలో దెనిసోవ్కా పరిసరాల్లో నేను జర్మన్ల చేతికి ఖైదీగా చిక్కాను.

అప్పుడు మా ఎడమపక్కనుంచి జర్మన్ టాంకులు తోసుకొచ్చాయి, కుడిపక్కనుంచి కాల్బలం పరుగెత్తుకొచ్చింది. వాళ్ళు మాచుట్టూచక్రబంధంచేశారు. ఐనా మేం పోరా

డుతూనే ఉన్నాం. ఆరోజు మాకంపెనీ ఎన్నోనష్టాలు చవిచూసింది. మేం ఓ రెండు టాంకుదాడుల్ని తిప్పికొట్టాం. శత్రువుటాంకులు ఆరింటినితగులబెట్టాం. చెడగొట్టాం. ఒక సాయుధశకటాన్ని ధ్వంసంచేశాం. ఓనూటిరవై మంది హిట్లర్ సైనికుల్ని మట్టి కరిపించాం. అప్పుడిక వాళ్ళు ట్రెంచ్ మోర్టార్ బాటరీలు పట్టుకొచ్చి మామీద పెద్ద ఎత్తున దాడిచేశారు. మేం మధ్యాన్నం నుంచి నాలుగింటిదాకా కాపాడగలిగిన ఎత్తయిన స్థావరాన్ని వదిలేసి పోవాల్సివచ్చింది. అసలే ఆరోజు పొద్దుట్నించి వాతావరణం ఉక్క-పోస్తూఉంది. ఆకాశం మీద ఒక్క మబ్బుతునుక కూడలేదు. ఊపిరి ఉక్కిరిబిక్కిర య్యేటంత తీక్షణంగా సూర్యుడు మండుతున్నాడు. మామీదికి తుపాకి గుళ్ళువేగంగా, విపరీతంగా దూసుకొస్తున్నాయి. అప్పుడు మేమెంత దప్పికతో ఉన్నామోతెలుసా? మా అందరిపెదాలూ నల్లబడి వాచిపోయాయి. ఓ బొంగురు గొంతు ఆదేశాలువిని, అదినా గొంతేనని నేను గుర్తుపట్టలేకపోయాను. అప్పుడు మేం ఓ ఖాళీ స్థలాన్ని దాటుతున్న ప్పుడు నాముందు ఓ బాంబుపడింది. క్షణాల్లో అదిపేలిపోయింది. నాకిప్పుడు లీలగా జ్ఞాపకమేమంటే భూమిలోపలినుంచి మట్టీ, చెత్తాకలిసి నాముందర ఓ నల్లని పెద్దమ మారంలేచింది. ఆ బాంబుతునుక ఒకటి నా శిరస్త్రాణంలోంచి దూసుకు పోయింది. మరొకముక్క నాకుడిభుజంలోకి దూసుకుపోయింది.

అలా అక్కడ స్మృహతప్పి పడిపోయి నేనెంతసేపున్నానో నాకుతెలియదు. నేల మీద కసపిసా పడుతున్న బూట్లచప్పుడుకు నాకు మెలకువ వచ్చింది. తలెత్తి చుట్టూ చూశాను అడినేను పడిపోయిన చోటుకాదని గుర్తించాను. నా యూనిఫాం చొక్కా-తీసేసిఉంది. కుడిభుజానికి మోటుగా కట్టిన కట్టుఉంది. శిరస్త్రాణం తలమీద లేదు. తలకుకూడ ఓకట్టుందిగాని అది సరిగా కట్టకదానితోక నా ఎదురొమ్ముమీద వేలాడు తోంది నేనుపడిపోయాక మావాళ్ళు ఇక్కడికిఎత్తుకొచ్చి కట్టుకట్టారని నేననుకున్నాను. మా వాళ్ళెక్కడయినా కనిపిస్తారేమోననే ఆశతో అతికష్టం మీద తలెత్తిచూశాను. కాని చూస్తేనా వైపు పరుగెత్తుకొస్తున్నది మావాళ్ళుకాదు, జర్మన్లు. నేను మేలుకున్నది వాళ్ళ బూట్లచప్పుడుకే. వాళ్ళను నేనిప్పుడు స్పష్టంగా సినిమా తెరమీదిలాగ చూడగలిగాను. ఓ రివాల్వరో, రైఫిలో, చేతిబాంబో దొరుకుతుందేమోనని నాచుట్టూ పుణికిచూశాను. కాని నాచేతికే ఆయుధమూ దొరకలేదు.

'ఇకనాపని ఆఖరు' అనుకున్నాను. ఇదికాక ఇంకేం ఆలోచనలు చేసిఉంటాను? ఏమో, నువు ఇప్పుడు నీభవిష్యత్తు పనులగురించి ఆలోచిస్తుంటే, దాని మధ్యలో వచ్చే ఖాళీలు నువ్వేనింపుకో. నిజం చెప్పాలంటే నాకుమాత్రం అప్పుడు మరేదీ ఆలోచించ

డానికి సమయంలేదు. జర్మన్‌లు నాకు మరింత మరింత దగ్గరగా వచ్చేస్తున్నారు. నేనలా పడి పోయేఉండి చచ్చిపోవడం నాకిష్టంలేదు. అంతే, అట్లాగాయపడి పడిపోయి మృత్యువును మౌనంగా ఒప్పుకోవాలని నేననుకోలేదు. ఇక ఆ కోరికతోనే శక్తితెచ్చు కొని అతికష్టం మీద ఎంతో ప్రయత్నించి నామోకాళ్ళమీద లేచికూచున్నాను. చేతుల్తో నేలను అదిమిపట్టి బలం తెచ్చుకున్నాను.

వాళ్ళు నాదగ్గరికి చేరేసరికి నేను నిలబడిఉన్నాను. నీరసంగానే ఉన్నాను, గాని నిలబడగలిగాను. ఏక్షణంలోనైనా నాశక్తి జారిపోతుందనీ, నేను కుప్పకూలిపోతాననీ, అప్పుడిక వాళ్ళ బయొనెట్లు నాశరీరాన్ని తూట్లుపొడుస్తాయనీ నేను విపరీతంగా భయ పడ్డాను. ఇప్పుడయితే నాకు వాళ్ళలో ఒక్కడి మొఖంకూడ గుర్తులేదు. వాళ్ళంతా నా చుట్టూచేరి వేళాకోళం మొదలెట్టారు. "వెధవల్లారా, ఒక్కసారే చంపేయండి. పడిపోక ముందేచంపేసి నాపీడవదల్చండి." అని అరిచాను. వాళ్ళలో ఒకడు నన్ను తనరైఫిల్ తో పొడిచాడు. నేనాపోటు తప్పించుకొగానే వాళ్ళు వికటాట్టహాసాలుచేశారు. వాళ్ళలో ఒకడు నన్ను నడవమన్నట్టు సైగచేశాడు, రెండడుగులేశాను. తలమీదిగాయంతో ముఖ మంతా రక్తంతో అలుక్కుపోయిఉంది. ఇంకా ఆగాయంనుంచి వేడిగా, జిగటగా నెత్తురు కారుతూనేఉంది. భుజం విపరీతంగా సలుపుతోంది. కుడిచెయ్యి లేపలేకపోతు న్నాను. ఎంత నిస్త్రాణగా ఉండిందంటే అప్పుడు నేననుకున్నదల్లా ఎక్కడన్నా పడి నిద్రిపోవాలనే, అంతేగాని ఎటూ నడుద్దామనిపించలేదు. ఐనా నడవక తప్పలేదు.

ఖచ్చితంగా నేనప్పుడు చనిపోదలచుకోలేదు. అంతకంటెఖచ్చితంగా ఖైదీగానూ బతకదలచుకోలేదు. అందుకే ఎంతో కష్టపడి శక్తితెచ్చుకొని నానిస్త్రాణనూ బాధనూ తరిమేసి ఈడ్చుకుంటూ ముందుకుసాగాను. నాలోఇంకా జీవంఉందన్నమాట! నేనింకా నడవగలనన్నమాట! కాని అప్పుడు దప్పికతో నేనెంత చచ్చిపోయానో. ఈడుస్తూ అడుగులు వేస్తున్నానేగాని గొంతంతా ఎండుకుపోయిఉంది. కళ్ళకింద ఏదో నల్లనిపొగ సుళ్ళుతిరగడం మొదలయింది. నేనప్పుడు స్పృహ తప్పి పడిపోతానేమోనని భయ మయింది. ఐనా ఓ నీటిబొట్టూ, ఓక్షణం విశ్రాంతీ దొరకగానే పారిపోవచ్చులే అని నాకు నేను చెప్పుకుంటూ అట్లాగే నడక సాగించాను.

అప్పుడికావన మా ఖైదీలందరినీ వరసగా నిలబెట్టారు. నేనుకాక మిగిలిన ఖైదీ లందరూ నాపక్కయూనిట్ వాళ్ళు. నా రెజిమెంట్, మూడో కంపెనీలోని ఇద్దరు ఎర్రి సైనికుల్ని నేనక్కడ గుర్తించాను. చాలమంది ఖైదీలు గాయపడేఉన్నారు.

ఓ జర్మన్ లెఫ్టినెంట్ ముందుకొచ్చి వచ్చీరాని రష్యన్‌లో మాలో కమిస్సార్‌లూ, కమాండర్‌లూ ఎవరైనా ఉన్నారా అని అడిగాడు. మాలో ఎవరూ జవాబివ్వలేదు. అప్పుడు వాడు మళ్ళీ ఓసారి "కమిస్సార్‌లూ, కమాండర్‌లూ రెండడుగులు ముందుకురండి" అనిఅరిచాడు. ఎవరూ ముందుకురాలేదు.

అప్పుడు వాడు మాలోంచి ఏకాస్త యూదులాగ కనిపించిన వాళ్ళనయినా బైటికి తీశాడు. అలా ఓ పదిహేనుమందినో, పదహారుమందినో జమచేశాడు. వాడు వాళ్ళలో ప్రతిఒక్కరినీ 'జూడ్‌వా?' అనిఅడిగాడు. జవాబువిననైనా వినకుండానే పడిపొమ్మని అరిచాడు. వాడు ఏరినవాళ్ళలో యూదులేకాక ఆర్మీనియన్లు, రష్యన్లు కూడఉన్నారు. దురదృష్టమల్లా వాళ్ళు యూదుల్లాగ నల్లగా ఉన్నారు, వెంట్రుకలు నల్లగా ఉన్నాయి. వాళ్ళందర్నీ కొంచెం అవతలికి నడిపించుకుపోయి మాముందే కాల్చిచంపేశారు. ఇక మిగిలిన వాళ్ళందర్నీ పైపైన సోదాచేశారు. మాపాకెట్ పుస్తకాలూ, ఇతర సొంత వస్తువులూ లాగేసుకున్నారు. నాకెప్పుడూ పార్టీకార్డు పాకెట్ పుస్తకంలో పెట్టుకునే అలవాటులేదు. నాప్యాంటుకు లోపలివైపు ప్రత్యేకంగా కుట్టించుకున్న జేబులోనే నా పార్టీకార్డుండేది. అందుకే వాళ్ళదిచూడలేదు. అలాంటి పరిస్థితిలో మానవస్వభావం గురించి ఆలోచిస్తే మనుషులెంత విచిత్రమైన వాళ్ళుగదా అనిపిస్తుంది. నాప్రాణం ఓదారం మీద వేలాడుతోందని నాకు ఖచ్చితంగాతెలుసు. పారిపోవడానికి ప్రయత్నించగలిగితే వాళ్ళునన్ను కాల్చేస్తారు. కాకపోతే, ఇంతరక్తం పోగొట్టుకున్న నీరసంతో నేను వెనకపడిపోతే వాళ్ళు నన్నురోడ్డుమీదనే కాల్చేస్తారు, ఐనా ఆ సోదా ఐపోయినాక నేను పార్టీకార్డునాతోనే ఉంచుకున్నాను, అప్పుడు గొప్ప సంతోషంలో నేను దప్పికనూ మరిచిపోయాను.

ఆ తర్వాత మమ్మల్ని మళ్ళీ వరుసల్లో నిలబెట్టి పడమటి వేపు నడిపించారు. రెండుపక్కలా గట్టి బందోబస్తుపెట్టారు. మావెనుక ఓడజనుమంది మోటారు సైకిళ్ళమీదవచ్చారు, మేమందరంవడివడిగా నడవాల్సివచ్చింది. నా శక్తి క్రమక్రమంగా సన్నగిల్లుతోంది. నేనప్పుడు రెండుసార్లు పడిపోయానుకూడా. ప్రతిసారీ నిలదొక్కుకుని మిగతా వాళ్ళతో కలిసిఅడుగేశాను. నేను ఒక్కనిమిషం వెనుకబడినా మిగతా వాళ్ళంతా ముందుకెళ్ళిపోతారనీ, రోడ్డుమధ్యలోనే నన్ను కాల్చిచంపేస్తారనీ నాకు తెలుసు. నా ముందునడిచిన సార్జెంటును అలాగేచంపేశారు. ఆయన కాలిలోగాయమై అతి కష్టంమీద ఈడిగిలబడుతూ నడక సాగించాడు. ఆయనప్పుడు అతి భయంకరంగా మూలుగుతూఉన్నాడు, చాలసార్లు బాధతో మొత్తుకున్నాడుకూడా. మేమలా ఓకిలోమీటరు

నడిచాక ఆయన 'లేదు, నేనింకనడవలేను. కామ్రేడ్స్, వీడ్కోలు!' అనేసి రోడ్డు మధ్యలో కూచుండిపోయాడు. మిగతావాళ్ళు ఆయనకు చెయ్యందించబోయారు. ఆయన మాత్రం ఎవరిసాయమూ తీసుకోకుండా నేలమీద పూర్తిగాపడిపోయాడు. నాకాదృశ్యం ఇప్పటికీ ఏదో కలలోలాగగుర్తుంది. అలసిపోయి, వాలిపోయిన ఆ యవ్వనం తొణికిసలాడే ముఖం, అల్లినట్టున్న కనుబొమ్మలు, బాధతో ఉబికినకన్నీళ్ళతో తడిసిపోయిన కళ్ళు. మాగుంపు ఆయనను వదిలేసి కదిలిపోయింది. నేనొక్కక్షణం వెనక్కుతిరిగి చూసాను. మోటర్ సైకిల్ వాళ్ళలో ఒకడు ఆయన పక్కకువెళ్ళి మోటర్ సైకిల్ మీది నుంచి దిగనైనాదిగకుండా తుపాకితీసి సార్జెంట్ చెవిలోకిదూర్చికాల్చేశాడు. మేం నది చేరేలోపల అలా వెనుకపడిపోయిన ఎర్రసైనికులెంతో మందిని జర్మన్లుచంపేశారు.

అప్పుడిక మాకు నదికనబడింది. అక్కడో వంతెన ధ్వంసమైపోయిఉంది. దాని దగ్గరకూరుకుపోయి ఉన్న ఓ ట్రక్కుకనబడింది. అక్కడ నేను కుప్పకూలిపోయాను. స్పృహతప్పిందా? ఏమో, కాదనుకుంటాను. ఏమైనా నేను నిట్టనిలువునా రోడ్డుమీద పడిపోయాను. నా నోట్లోమట్టి నిండుకుపోయింది. కోపంతో, బాధతో పళ్ళు గిట్టకరిస్తే పళ్ళకింద ఇసుకగరగరలాడింది. ఇకలేవలేకపోయాను. నా కామ్రేడ్సందరూ పక్కనుంచి నడచిపోతున్నారు. 'లే, త్వరగాలే. లేకపోతే వెధవలుచంపేస్తారు.' అని గొణిగారు. నేను నోట్లో వేళ్ళుకుక్కుకుని నోరు తెరుచుకుందామని ప్రయత్నించాను కనుగుడ్లమీద గట్టిగాఒత్తుకున్నాను. అట్లానయినా నాలోబాధ అలలుగాఎగసి, ఆ కదలికతోనైనా నేను లేచి నిలబడగలుగుతానేమోనని నా ఆశ.

నాతోపాటున్నవాళ్ళందరూ నన్నువదిలి కదిలిపోయారు. మోటర్ సైకిళ్ళు నా దగ్గరికొస్తున్న శబ్దంనాచెవుల్లో ఉరమడంమొదలయింది. అప్పుడిక ఏమొందిశక్తితోనో నేను నాకాళ్ళమీద లేచినిలబడ్డాను. మోటార్ సైకిల్ వాడివేపుచూడకుండా తాగినవాడిలాగ సోలుతూ గుంపులోపడేదాక పరుగెత్తాను. గుంపులో కలిసిపోయాను. నదిదాటుతూ మేం ఆనందంగా, సంతృప్తిగా ఆనీళ్ళుతాగాం. టాంకులూ ట్రక్కులూ ఆనీటినిబాగా బురదచేశాయి. ఆ వేడిగా, బురదగా ఉన్ననీళ్ళే మాకు ఊటలోఊరిన స్వచ్ఛమైన నీళ్లకంటె తియ్యగాఅనిపించాయి. నేను నాతలమీదా, భుజంమీదా నీళ్ళుచల్లుకున్నాను. దాంతో నేను కొంచెంతేటపడ్డాను. నా శక్తి తిరిగివచ్చినట్టనిపించింది. అప్పుడిక నాకు రోడ్డుమధ్యలో పడిపోయి దిక్కులేకుండాచావననే విశ్వాసం కలిగింది.

మేమానదిని దాటీదాటగానే ఓపెద్ద జర్మన్ టాంకుల వరస ఎదురైంది. మేం ఖైదీలమని గమనించి మొదటిటాంక్ డ్రైవర్ గ్యాస్‌వదిలి టాంకుల్ని వేగ--

మీదికి నడిపించాడు. మాలో ముందరి వరుసలవాళ్ళు ఆ టాంకుల చక్రాలకిందపడి నలిగిపోయారు, అణగిపోయారు. ఈ దృశ్యంచూసి మోటర్ సైకిళ్ళ వాళ్ళూ, మిగతా బందోబస్తువాళ్ళూ పగలబడినవ్వారు. టాంకు డ్రైవర్ల వేపుతిరిగి ఏదోఅరిచారు. వాళ్ళు తలలుబైటికి నిక్కబెట్టి చేతూలూపారు. అప్పుడు వాళ్ళు మమ్మల్ని మళ్ళీ వరుసల్లో నిలబెట్టి రోడ్డుమీదనడిపించారు. వాళ్ళ సరదాలు అలాంటివన్నమాట।

ఆ సాయంత్రమూ, రాత్రీ తప్పించుకోవడానికి నేనే ప్రయత్నమూచెయ్యలేదు. నేనంత సులభంగా తప్పించుకోలేనని నాకర్థమైంది. చాలరక్తం పోయినందువల్ల నేను నీరసంగాఉన్నాను. అంతేగాక మామీద గట్టి నిఘాకూడ పెట్టారు. తప్పించుకునే ప్రయత్నం ఏ కాస్త చేసినా అది చావుతో ముగియకతప్పదని నాకర్థమైంది. కాని ఆ ప్రయత్నమైనా చెయ్యనందుకు ఆ తర్వాత నన్ను నేను ఎంత తిట్టుకున్నానో! మర్నాడు మమ్మల్ని ఓ ఊళ్లోనుంచి తీసుకుపోయారు, ఆ ఊళ్ళో జర్మన్ యూనిట్ ఒకటి విడిది చేసిఉంది. ఆజర్మన్ సైనికులు మమ్మల్ని చూడడానికి రోడ్డుపక్కకు పరుగెత్తుకొచ్చారు. మాకు కాపలాఉన్నవాళ్ళు మమ్మల్ని గెంతుతూవెళ్ళమన్నారు, అప్పుడే యుద్ధరంగానికి రాబోతున్న సైనికుల కళ్ళముందర మమ్మల్ని ఎక్కువ అవమాన పరచడమే వాళ్ళ ఉద్దేశ్యం. మేం అలాగే పరుగెత్తాం. ఎవరైనా వెనుకబడిపోయినా, పడిపోయినా అక్కడికక్కడే కాల్చేశారు. సాయంత్రానికల్లా మేం యుద్ధఖైదీల శిబిరానికి చేరుకున్నాం.

నిజానికదేదో వాహనాలస్థలం. దాని చుట్టూ ముళ్ళతీగల కంచెఉంది. ఖైదీలందరినీ పక్కపక్కనే నిలబెట్టి ఆ కంచెలోపలికితోశారు. అక్కడ శిబిరం కాపలాదారుకు మమ్మల్ని అప్పగించారు. లోపలికి తోసేటప్పుడు రైఫిల్ మడమలతో మమ్మల్ని బాదారు. ఆ శిబిరం నరకం లాగుంటుందని చెప్తే దాన్ని వర్ణించినట్టేకాదు. ఒక్క విషయం చెప్పాలంటే అక్కడ కనీసం మరుగు దొడ్డయినాలేదు. ఎక్కడున్నవాళ్ళు అక్కడే మలమూత్రాలు విసర్జించి ఆకంపులోనే మురికిలోనే పడిఉండాల్సివచ్చేది. బాగా బలహీనంగా ఉన్నవాళ్ళు అసలులేచి నిలబడలేకపోయేవాళ్ళు. మాకు రోజుకో సారి తిండీ, తాగడానికిన్ని నీళ్ళూ ఇచ్చేవాళ్ళు. అంటే ఓగ్లాసెడునీళ్ళూ, ఓపిడికెడు పచ్చిజొన్నలో, పొద్దుతిరుగుడు విత్తనాలో అన్నమాట. తిండంటే అంతే. కొన్ని రోజులైతే వాళ్ళు మాకీతిండిపెట్టడం కూడ మరిచిపోయేవాళ్ళు.

ఒకటి రెండురోజుల తర్వాత బాగా వానలు కురిశాయి. నేలంతా మా మోకాళ్ళ

కనబడేవాళ్ళు. గుర్రాల్లాగ వాళ్ళ శరీరాలనుంచి పొగలువస్తుండేవి. ఆ వర్షం ఎంతకూ తగ్గిపోలేదు. ప్రతిరాత్రి ఎందరో ఖైదీలు చచ్చిపోయేవాళ్ళు. తిండిలేక మేం రోజు రోజుకూ ఎండుకుపోయాం. నా గాయాలు విపరీతంగా సలపడం మొదలయింది.

ఆరో రోజుకల్లా నా తలా, భుజమూ పుళ్ళయిపోయాయని నేను గుర్తించాను. గాయాలనుంచి చీముకారుతోంది. వాటినుంచి ఘోరంగా దుర్వాసనరావడం మొదలయింది. మాశిబిరం పక్కనే ఓసహకార వ్యవసాయక్షేత్రం పశువుల శాలలున్నాయి. తీవ్రంగా గాయపడ్డ ఎర్రసైనికుల్ని అక్కడే పడేసి ఉంచేవాళ్ళు. ఓ రోజు పొద్దున్నే నేను మాకాపలా సార్జెంట్ దగ్గరికెళ్ళి డాక్టర్‌దగ్గరి కెళ్ళనివ్వమని అడిగాను. ఆ గాయపడిన వాళ్ళదగ్గర డాక్టర్ ఉన్నాడని నాకెవరోచెప్పారు. ఆ జర్మన్ ఎన్ సి ఓ చాలాబాగా రష్యన్‌మాట్లాడాడు 'ఆఁ. ఏమిటి రష్యన్, మీడాక్టర్ దగ్గరికెళ్తావా ? ఆయన నీకు తప్పకుండా నయంచేస్తాడులే, అన్నాడు. ఆయన మాటల్లోని ఎగతాళి నాకర్థంకాలేదు. అనుమతి దొరికింది గదా అని సంతోషపడ్డాను. ఆపశువుల శాలవేపు దారితీశాను.

ఆ తలుపు దగ్గరే సైనికడాక్టర్ నాకెదురయ్యాడు. ఆయన చావుకు దగ్గరైన మనిషిలా కనబడ్డాడు. సన్నగా గాలివీస్తే పడిపోయేట్టున్నాడు. బాగా అలసిపోయినట్టు కనబడ్డాడు. ఇప్పటికి చూసినవాటితో ఆయనకు సగం పిచ్చెక్కినట్టుంది. అక్కడ క్షతగాత్రులు ఎరువుల కుప్పలమీద పడుకొనిఉన్నారు. అక్కడ కక్కొచ్చేట్టు దుర్వాసన వస్తోంది. వాళ్ళ పుళ్ళమీద పురుగులు తిరుగాడుతున్నాయి. కొంచెం శక్తి ఉన్న వాళ్ళు తమ వేళ్ళతోనో కర్రలతోనో ఆ పుళ్ళలోంచి పురుగుల్ని బైటికితోడి చంపేస్తున్నారు. వాళ్ళపక్కనే ఎందరో ఖైదీల శవాలుకుప్పగా పడున్నాయి. ఆ శవాలను పూడ్చిపెట్టేతీరిక ఎవరికీలేదు.

'అటుచూడు. ఇంక నేన్నీకేం సాయపడతాను ? నా దగ్గర పుళ్ళు శుభ్రం చెయ్యడానికీ కట్లుకట్టడానికీ ఏమీలేదు. నీ ఇష్టం, దేవుడి దయఉంటే బతుకుతావు. నీకిప్పుడున్న కట్లువిప్పేసి అక్కడున్న బూడిద పుళ్ళమీదచల్లుకో. తలుపుదగ్గర కొత్త బూడిద ఉందిచూడు.' అన్నాడాడాక్టర్.

నేనాయన చెప్పినట్టేచేశాను. ఇంతలోనే ఆ జర్మన్ ఎన్ సి ఓ మాదగ్గరి కొచ్చాడు. వాడి ముఖంలో హేళనతోకూడిన చిరునవ్వు వెలుగుతోంది. 'ఆఁ. నయమైందా ? మీ సైనికులకు మంచి డాక్టరున్నాడుగదూ. మీ డాక్టర్ నీకేమన్నా

సాయపడ్డాడా?' అన్నాడు. వాడికేమీ జవాబు చెప్పకుండానే బైటపడదామనుకున్నాను. కాని వాడు నా మొఖంమీదగుద్ది 'నాకు జవాబుచెప్పవూ, పందివెధవా' అని మొరిగాడు. నేను కిందపడిపోయాను. వాడు నా రొమ్ముమీదా, తలమీదా తన్నడంమొదలెట్టాడు. అలుపొచ్చేదాకా అలా తంతూనేఉన్నాడు. నేను బతికిఉన్నంతకాలమూ ఆ జర్మన్‌ను మరిచిపోను. ఊహుఁ, అసలే మరిచిపోలేను. తర్వాతకూడ వాడు నన్నెన్నోసార్లు తన్నాడు. ఆ కంచె అవతలినుంచి వాడికళ్ళు నామీద బడ్డాయంటేచాలు నన్నుబైటికి తీయించి నిశ్శబ్దంగా, ఏకాగ్రంగా అలుపొచ్చేదాకా కొడుతుండేవాడు.

నేనదంతా ఎట్లాతట్టుకున్నానో ఆశ్చర్యంవేస్తోందా? యుద్ధానికిముందు మెకానిక్‌కూడ కాకముందు కామానదిమీద ఓడ కళాసీగా పనిచేసేవాణ్ని, ఒకేసారి రెండు ఉప్పుబస్తాలు మోయగలిగేవాణ్ని. ఔను, నేనుకొంచెం బలంగానే ఉండేవాణ్ని. ఏ రోగమూ నొప్పిలేకుండా ఉండేవాణ్ని. మొత్తంమీద నాదిగట్టిశరీరమే అనుకో. అంతకంటె ముఖ్యమైన సంగతేమంటే నేనప్పుడు ఏంతమాత్రమూ చావడానికి సిద్ధంగాలేను. నా ప్రతిఘటనాశక్తి ఎక్కువగా ఉండింది. నేనుమళ్ళీ నాసైన్యంలోకి రాదలచుకున్నాను. మొత్తంమీదనేను వెనక్కిరాదలచుకున్నాను. శత్రువుమీద పగ తీర్చుకోవడంలో చివరిదాకా పోరాడదలచుకున్నాను.

ఆ శిబిరం ఖైదీల పంపిణీ కేంద్రమనుకుంటాను. నన్నాశిబిరంనుంచి మరో వందకిలోమీటర్ల దూరానికి బదిలీచేశారు. దీనికీ మొదటిదానికీ ఏమీతేడాలేదు. అవే పొడవాటిగుంజలు, ఆ గుంజలకు అలాంటిదే ముళ్ళకంచె, ఖైదీలమీద కప్పుఏమీ ఉండదు. అంతే, అలాఉండవలసిందే. తిండికూడ మార్పేమీలేదు. అప్పుడప్పుడు ముక్కిపోయినధాన్యంమాత్రం ఇంత పడేస్తుండేవాళ్ళు, పచ్చిజొన్నలబదులు ఇది పండిస్తున్నామని వాళ్ళు. లేదా వాళ్ళు అప్పుడప్పుడు ఓ చచ్చినగుర్రాన్ని మా దగ్గరికి లాక్కొచ్చి ఆ మాంసాన్ని పంచుకొమ్మని మాకు చెప్పేవాళ్ళు. ఆకలికి చచ్చి పోకుండా ఉండేందుకు. మేం అదే తింటుండేవాళ్ళం. వందలాదిమంది మా వాళ్లు ఆకలికి చచ్చిపోయారు. ఆప్పుడిక ఉన్నదానికితోడు ఊపిరికుట్టినట్టు చలిమొదలయింది. అక్టోబర్‌లో ఎడతెగకుండా వర్షాలుకురిశాయి. రోజూ తెల్లారేసరికల్లా చుట్టూ పొగమంచు కమ్ముకునేది. ఆ క్రూరమైన చలిలో మేమెన్నికడగండ్లు అనుభవించామో.... నేను చనిపోయిన సైనికుల చొక్కా, కోటూ సంపాయించాను. అవైనా నన్ను చలినుంచి కాపాడలేకపోయాయి. అప్పుడు మేం ఓపక్క చలితో, మరోపక్క ఆకలితో చచ్చిపోయాం.

మా కాపలా సైనికులు బాగా మెక్కుతున్నట్టే కనబడేవాళ్ళు. మా దగ్గర్నించి దోచుకున్నదానితో వాళ్ళు బలిసిపోతూ ఉండేవాళ్ళు. వాళ్ళంతా ఒకే కుంచెతో తాడు పూయించుకున్న మనుషుల్లా ఉండేవాళ్ళు. ఇంతలా ఏంపికచేసిన వెధవలగుంపు మరొకటి ఉండడంకష్టం.

వాళ్ళ సరదాలెలా ఉండేవో తెలుసా? ఓ రోజు ఉదయాన్నే ఒక కార్పొరల్ కంచె దగ్గర నిలబడి దుబాసీతో "ఇప్పుడే మీ అందరికీ రేషన్సు ఇస్తున్నాం. అందరూ ఎడంపక్క బార్లుకట్టి రేషన్ తీసుకోవచ్చు" అని చెప్పించేవాడు. ఈ మాట చెప్పించి వాడు వెంటనే వెళ్ళిపోయేవాడు. అప్పుడిక మాలో నిలబడగలిగిన శక్తి ఉన్న ప్రతివాళ్ళూ వెళ్ళి ఎడమపక్కన వరుసల్లో నిలబడేవాళ్ళు. అలా ఇకరెండిపెడతారు, పెడతారు అని ఎదురు చూస్తూండే వాళ్ళం. గంట, రెండుగంటలు, మూడుగంటలపాటుకూడ అలా నిలబడే ఉండేవాళ్ళం. వందలాది వణుకుతున్న జీవచ్ఛవాలు, అస్థిపంజరాలు, ఆ ఒళ్ళు కొంకర్లు తిరిగే చలిలో కళ్ళలో ఒత్తులేసుకొని నిలబడేవాళ్ళు.

హఠాత్తుగా జర్మన్లు కుడిపక్కనుంచి కనబడేవాళ్ళు. కంచెమీదినుంచి వాళ్ళు గుర్రం మాంసం ముక్కల్ని లోపలికి విసిరేసేవాళ్ళు, ఆకలికి అలమటిస్తున్న గుంపంతా పొలోమంటూ తొక్కిసలాడుతూ అటువైపు పరుగుతీసేవాళ్ళు. బురదలో పడిపోయిన ఆ మాంసం ముక్కల్ని సంపాయించడానికి అక్కడ అప్పుడు పెద్దగొడవే జరుగుతుండేది.

ఇదంతా చూసి జర్మన్లు పగలబడి నవ్వుతుండేవాళ్ళు. హఠాత్తుగా జనం మీదికి మెషిన్‌గన్ కాల్పులు జరిపేవాళ్ళు. ఆ ప్రాంతమంతా అరుపులూ మొత్తుకోళ్ళూ వినిపించేవి. చనిపోయినవాళ్ళనూ, గాయపడినవాళ్ళనూ అక్కడే వదిలేసి అందరూ ఎడమవేపు పరుగెత్తేవాళ్ళు. అప్పుడిక శిబిరం సూపరింటెండెంట్, ఫస్ట్ లెఫ్టినెంట్ దుబాసీతో కంచెపక్క ప్రత్యక్షమయ్యేవాడు. నవ్వును దాచుకుంటున్నట్టు నటిస్తూ వాడు "రేషన్సు పంపిణీ అప్పుడు ఇక్కడ విచారకరమైన సంఘటన జరిగిందని విన్నాను. ఇలాంటి సంఘటన మరోసారి జరిగితే మాత్రం ఊరుకునేది లేదు. మీ రష్యన్ పందు లందర్నీ నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేయిస్తారు. చచ్చిపోయిన వాళ్ళనూ, గాయపడ్డ వాళ్ళనూ పక్కకు ఈడ్చేయండి" అని మొరిగేవాడు. వాడి వెనుక నిలబడ్డ జర్మన్ సైనికుల గుంపు పగలబడి నవ్వుతూ ఉండేది. ఇలాంటి క్రూరమైన సరదాలంటే వాళ్లకు మోజు. మేం నిశ్శబ్దంగా అమృతదేహాల్ని శిబిరంలోంచి బైటికి ఈడ్చుకుపోయేవాళ్ళం.

ఆశిబిరంలో మమ్మల్నెప్పుడూ తంతూనేఉండేవాళ్ళు. పిడికిళ్ళతో, కర్రల్తో, తుపాకి మడమలతో బాదేవాళ్ళు. కొన్నిసార్లు వాళ్ళ విసుగునుంచి మార్పుకోసంకూడ మమ్మల్ని తన్నేవాళ్ళు. కొన్నిసార్లు సరదాకోసం మమ్మల్నితన్నేవాళ్ళు. నా పుళ్ళు ఇలా మానడం మొదలుకాగానే, తేమకో తన్నులకో అవి మళ్ళీ సలపడం మొదట్టి పెట్టేవి. అప్పుడుమాత్రం బాధ దుర్భరంగాఉండేది. కాని నేనాబాధంతా తలు కున్నాను. ఆ బాధల్ని అధిగమించి బతికాను. ఎప్పుడో ఓ నాటికి విడుదలవుతాననే ఆశమాత్రం నాలోచావలేదు. మేం బురదనేలమీదనే నిద్రపోయేవాళ్ళం. మాకు కింద పరచుకోవడానికి కనీసం ఇంత గడ్డికూడ ఇచ్చేవాళ్లుకారు. మేమందరమూ ఒకళ్ళపక్క ఒకళ్ళం ఇరికి ఆనేలమీద, చలిలో పడుకునేవాళ్లం. రాత్రింతా అలా చలికి వణుకు తూనే ఉండేవాళ్లం. అడుగునఉన్నవాళ్లు చలికి గడ్డకట్టిపోయేవాళ్లు, పైనున్నవాళ్లా అంతే రాత్రింతా నిద్రఉండేదికాదు, విశ్రాంతీ ఉండేదికాదు. భయంకరమైన వేదన ఉండేది,

ఆ రోజులు ఏదో పీడకలలాగసాగాయి. రోజురోజుకూ నేను బలహీనమై పోయాను. చిన్నపిల్లలుతోసినా పడిపోయేట్టు తయారయ్యాను. పుల్లల్లా తయారయిన నా చేతులు చూసుకుంటే ఆశ్చర్యంవేసేది. 'ఇక్కడ్నుంచి అసలు బైటపడతానా' అని మధనపడేవాణ్ని. తొలిరోజుల్లోనే తప్పించుకునే ప్రయత్నం చెయ్యనందుకు నన్ను నేనే తిట్టుకునేవాణ్ని. అలా చచ్చిపోయినా ఈ దారుణహింసల్ని తప్పించుకోగలిగే వాణ్ని.

ఇంతలో చలికాలం వచ్చింది. మేం పైనరాలిన మంచు ఊడ్చేసి, గడ్డకట్టిన నేలమీద పడుకునేవాళ్లం. మాసంఖ్య క్రమంగా తగ్గిపోతోంది. చివరికి మమ్మల్ని కొన్నిరోజుల్లో పనికిపంపుతామని ప్రకటించారు. మేమెంతో సంతోషించాం. ప్రతి ఒక్కరి హృదయమే ఆశతో స్పందించింది. అది చిన్నఆశేకావచ్చుగాని. ఎలాగైనా మేం తప్పించుకోవచ్చుననే ఆశ మాలో కలిగింది.

ఆ రాత్రి నిశ్శబ్దంగాఉంది. మంచు కురుస్తూఉండింది. వేకువజామున్నే మాకు తుపాకిమోతలశబ్దం వినిపించింది. మా వాళ్లందరూ ప్రాణంవచ్చినట్టు లేచి కూచున్నారు. మళ్లీ తుపాకులమోత వినిపించగానే మాలోఎవరో 'కామ్రేడ్స్, మన దళాలే! మనవాళ్లువచ్చారు' అని సంతోషంగా అరిచారు. ఆ తర్వాత సంఘటనలు గుర్తించలేనంత వేగంగా జరిగిపోయాయి. మొత్తం శిబిరం శిబిరమంతా ఉరుకులు

పరుగులు మొదలుపెట్టింది. కొన్నాళ్లగా లేవలేకుండా ఉన్నవాళ్లకూడ లేచి అటూ ఇటూ తిరిగారు. చుట్టూ ఎటుచూసినా గుసగుసలూ, వెక్కిళ్లూ వినబడ్డాయి. నా పక్కనే ఎవరో స్త్రీలాగ ఏడవడం మొదలుపెట్టారు. నేను, నేనుకూడ ఏడవడం....'

ఈ మాటలు గబగబా అనేస్తుండగా గెరాసిమోవ్ గొంతుగద్గదమైంది. కొద్ది క్షణాల తర్వాత కుదుటబడి మళ్లీ ప్రశాంతంగా చెప్పడం మొదలుపెట్టాడు.

"నా చెంపలమీద కన్నీళ్లు కాల్వలుకట్టాయి. ఆ చలిగాలికి చెంపలమీద కన్నీళ్లు గడ్డకట్టాయి. ఎవరో సన్నని గొంతుతో అంతర్జాతీయ గీతం అందుకున్నారు. మా బలహీనమైన గొంతులతో మేమందరమూ ఆగీతం ఎత్తుకున్నాం. కాపలా జర్మన్లు మామీదికి కాల్పులజరిపారు. వెంటనే ఎవరో 'పడుకోండి' అని అరిచారు. నేను నిట్టనిలువునా పడిపోయి ఆ మంచులోకి నా శరీరాన్ని అదిమాను. చిన్నపిల్లాడిలాగ ఏడ్చాను. ఔను ఏడ్చాను. కాని అవి గర్వంతో, ఆనందంతో ఉబికిన కన్నీళ్లు. మా ప్రజలపట్ల నేను గర్వపడ్డాను. జర్మన్లు మమ్మల్ని చంపగలిగారేమో, మమ్మల్ని నిరాయుధం చేయగలిగారేమో, హింసించగలిగారేమోగాని మా దీక్షనుమాత్రం విచ్ఛిన్నం చేయలేకపోయారు. చెయ్యలేరుకూడా. వాళ్ళకందుకు శక్తిలేదు, అంతే.

* * * *

ఆ రాత్రి నేను గెరాసిమోవ్ కథనుపూర్తిగా వినలేకపోయాను. ఆయన్నివెంటనే రెజిమెంటు కేంద్రంనుంచి కబురొచ్చింది. మేంమళ్లీకొన్నాళ్ల తర్వాత కలుసుకున్నాం. ఆ కందకంలో ఏదో ఉడకబెట్టినవాసనా, చెట్ల బంకవాసనా వస్తోంది. ఆయన ఓ బెంచి మీదకూచున్నాడు. పెద్దగా ఎముకలుతేలిన చేతులు మోకాల్లమీద పెట్టుకొని, వేళ్లముడి వేసుకుని ముందుకు వంగివున్నాడు. అలా వేళ్లముడి వేసుకుని, మౌనంగా, నిరాశలో మునిగిపోయి, బాధపడుతూ, నిష్ఫలధ్యానంలో కూచోవడం ఆయనకు ఆ యుద్ధఖైదీ శిబిరాల్లో అలవాటయి ఉంటుందని నాకనిపించింది.

"నేనెలా తప్పించుకున్నానో తెలుసుకోవాలని ఉందిగదూ నీకు? చెప్తానువిను. ఆ తుపాకిమోతలు విన్న రాత్రి తర్వాత వెంటనే వాళ్లు మాతో కందకాలూ, కంచెల పని చేయించడం మొదలెట్టారు. ఆరోజుల్లో మంచుకరగడం మొదలైంది. వర్షాలొచ్చాయి. ఆ శిబిరంనుంచి ఉత్తరం వైపుకు మమ్మల్ని నడిపించుకు వెళ్లారు. రోడ్డుమీద మళ్లీ పాతకథే కొనసాగింది. అలసిపోయి పడిపోయిన వ్యక్తులు కాల్చిచంపేయబడ్డారు. వాళ్లమృతదేహాలు అక్కడే దిక్కులేకుండా పడిపోయాయి....

ఓ గడ్డకట్టిన బంగాళాదుంప ఏరుకున్నందుకు మాలో ఒకర్ని ఓ జర్మన్ ఎస్ సీ ఓ కాల్చేశాడు. అప్పుడు మేం ఓ బంగాళాదుంపల పొలంపక్కనుంచి వెళ్తున్నాం. గొన్‌చార్ అనే మేసార్జెంట్ పైకితేలిన ఒక బంగాళాదుంపను ఏరుకుని దాచుకుందా మనుకున్నాడు. అది చూసిన జర్మన్ ఎస్ సి ఓ నిశ్శబ్దం గొన్‌చార్ వెనక్కివెళ్లి తల వెనుకనుంచి కాల్చేశాడు, అప్పుడు మమ్మల్నందరినీ ఆపించి మళ్ళీ వరుసకట్టించారు. ఆ ఎస్ సి ఓ చెయ్యిచాపి 'ఇదంతా జర్మన్ ఆస్తి. అనుమతిలేకుండా వీటిమీద వేలేసి ముట్టినవాణ్ని చంపిపారేస్తాం....' అని అరిచాడు.

తోవమీద మేం ఓ ఊళ్ళోంచి వెళ్ళాల్సివచ్చింది. మమ్మల్ని చూసిన స్త్రీలు బైటికొచ్చి రొట్టెముక్కలూ, ఉడకబెట్టిన బంగాళాదుంపలూ మావైపు విసిరారు. మాలో కొందరం అవి అందుకోగలిగాం. మాకాపలా వాళ్ళు రెండుపక్కలా ఉన్న ఇళ్ళకిటికీల మీదికి కాల్పులు జరిపారు. మమ్మల్ని వేగంగా నడవమని ఆదేశించారు. కాని పిల్లల్నెవరు భయపెట్టగలరు? వాళ్ళు మాకంటెముందే రోడ్డుమీద పరుగెత్తి రొట్టెముక్కలు అక్కడపెట్టారు. నాకో పెద్ద ఉడికించిన బంగాళాదుంప దొరికింది. నేనూ, నా పక్కనున్న సైనికుడూ కలిసి ఆ బంగాళాదుంపతిన్నాం. తొక్కకూడ వది లేయకుండా తినేశాం. అంత రుచికరమైన పదార్థం నాజీవితం మొత్తంలో తినలేదని నాకనిపించింది.

మేం ఓచిట్టడవిలో కందకాలు తవ్వేపనిమీదఉన్నాం. మాచుట్టూ కాపలాపెంచి, మా అందరికీ పారలిచ్చారు. కాని వాళ్ళకోసం నిర్మాణం చేయాలని నేనసుకోలేదు. ధ్వంసమే చేయదలచుకున్నాను.

ఆరోజు సాయంత్రమే నేనింక గట్టిగా నిశ్చయించుకున్నాను. నేను తవ్వుతున్న గుంతలోంచి బైటకొచ్చేసి, ఎడంచేత పారపట్టుకొని మాకాపలా జవాను దగ్గరికి బైలు దేరాను.... మిగిలిన జర్మన్లు కొస్తదూరంగానే ఉన్నారనేది గుర్తించాను వాళ్ళందరూ వాళ్ళగొడవలోనే ఉన్నారు. మా జవాను తప్ప కనుచూపుమేరలో మరో జర్మన్ ఎవడూ లేడు.

ఆ సైనికుని దగ్గరిదాకావెళ్తూ "చూడు, నాపారవిరిగిపోయింది,' అనిగొణిగాను. నేను మొదటిపోటుకే వాణ్ని మట్టికరిపించలేకపోతే, నా పనిఆఖరవుతుందని నాకర్థ మైంది. వాడు నా ముఖంలో భావం కనిపెట్టాడో ఏమో తనభుజానికున్న ఆటోమాటిక్ తుపాకిని సవరించుకోబోయాడు. వెంటనే నేను పారతో వాడి మొఖంమీదగుద్దాను. వాడి తలమీద శిరస్త్రాణం ఉండడంతో తలమీదమోదిన దెబ్బ వాడికేమీతాకలేదు.

ఐనా నా పోటు వాడు నిశ్శబ్దంగా పడిపోయేట్టుచేసింది. కిక్కురుమనకుండా వాడు పడిపోయాడు.

ఇప్పుడిక నాదగ్గర ఓ ఆటోమాటిక్‌తుపాకీ, మూడుగుళ్ళు ఉన్నాయన్న మాట. నేను పరుగెత్తడం మొదలెట్టాను. కాని కొంతదూరం ఉరకగానే నాకంత శక్తి లేదని నాకు తెలిసిపోయింది. కొంతసేపు ఆగి, కుదుటపడి చిన్నగా అడుగులువేస్తూ ఉరకడం మొదలెట్టాను. నేను పరుగెత్తేవైపు అడవి చిక్కగాఉంది. ఆ పరుగులో నేనెన్ని సార్లుపడిపోయానో, లేచానో, మళ్ళీ పడిపోయానో నాకు గుర్తులేదు. కాని మొత్తానికి నిమిషనిమిషానికీ నేను ముందుకేసాగాను. సగంపాక్కుతూ, అలసటతో రొప్పుతూ నేను కొండకు ఆవలివైపు అడవిలోకిచేరాను. అప్పుడు నా వెనకెక్కడో మెషిన్‌గన్ చప్పుళ్ళు, కేకలూ వినపడ్డాయి. కాని ఇకవాళ్ళు నన్ను పట్టుకోలేరు.

త్వరలో చీకటిపడుతుంది. కాని జర్మన్లు ఈలోగానే నన్ను పట్టుకోగలిగితే. సరే-నా తుపాకిలో చివరిగుండు నా కోసమే మిగిల్చిపెట్టుకుంటాను ఆ ఆలోచనతోనే నేను తేరుకున్నాను. అప్పుడిక జాగ్రత్తగా, నింపాదిగా నడకసాగించాను.

ఆ రాత్రింతా నేనా అడవిలోనే గడిపాను నాకు అరకిలోమీటరు దూరంలో ఓ ఊరు కనబడింది. గాని ఊళ్ళోకి వెళ్ళడానికి నేను సంకోచించాను. మళ్ళీ జర్మన్లు ఎదురుపడతారేమో ననుకున్నాను.

ఆ మరునటి రోజు నన్ను మనపార్టీ కార్యకర్తలు గుర్తించారు. శక్తి వచ్చేదాకా రెండు మూడు వారాలపాటు నేను వాళ్ళ కందకంలోనే ఉండిపోయాను. నేను నాపార్టీ కార్డుచూపినా, వాళ్ళు మొదట నాపట్ల కొంచెం అనుమానంగానే ఉన్నారు. శిబిరంలో ఉన్నప్పుడు నేనా కార్డును కోటుమడతల్లో కుట్టుకున్నాను. కాని ఆ తర్వాత నేను వాళ్ళ పనుల్లో సాయపడడం మొదలెట్టాక నన్ను వాళ్ళునమ్మారు. ఇక అక్కడే నేను జర్మన్లను చంపేఖాతా మొదలుపెట్టాను. ఇప్పటిదాకా ఆఖాతా జాగ్రత్తగా లెక్కపెడుతూనేఉన్నాను. ఇప్పటికి నా ఖాతాలో వందో సంఖ్య చేరడానికి సిద్ధంగా ప్రతీకారాలు క్రమంగా పెరుగుతున్నాయి.

జనవరిలో మనవాళ్ళు నన్ను రహస్యంగా యుద్ధరంగంనుంచి వెనక్కిపంపారు. ఓ నెలపాటు ఆస్పత్రిలో ఉన్నాను. అక్కడ నాకుడిభుజంలోంచి బాంబు ముక్కను బైటికిలాగారు. ఇక కీళ్ళజబ్బులాంటి శిబిరంలో వచ్చినజబ్బులన్నీ యుద్ధం పూర్తయ్యాక వదుల్చుకోవాల్సిందేననుకో.... నన్ను ఆస్పత్రినుంచి పూర్తిగా కోలుకునేందుకు ఇంటికి పంపారు. ఇంట్లోనేను ఓ వారంరోజుల కన్న ఎక్కువ గడపలేకపోయాను. వెంటనే

యుద్ధంలోకి వెళ్ళిపోవాలని తహతహలాడాను. ఏదేమైనా నా స్వస్థలం యుద్ధరంగమే, చివరివరకూ అంతే....

* * * *

ఆ కందకం మొదట్లో మేం ఒకరికొకరం వీడ్కోలు చెప్పుకున్నాం. మా ముందర అడవి నరికేసిన బయలుప్రదేశం సూర్యకాంతిలో మెరిసిపోతోంది. లెఫ్టినెంట్ గెరాసిమోవ్ ఆ మైదానం వైపు ఏకాగ్రంగా చూస్తూ.

"....నిజంగా ఎలా యుద్ధం చేయాలో మనం నేర్చుకున్నాం. ఎలా ప్రేమించాలో, ఎలా ద్వేషించాలో మనం నేర్చుకున్నాం. అన్ని అనుభూతులను సరిగ్గా సాన పెట్టేది యుద్ధమే. ప్రేమనూ, ద్వేషాన్నీ పక్కపక్కనే పెట్టలేమని నువ్వనుకుంటావు. గుర్రాన్నీ, పిరికిలేడినీ ఒకేగాటకట్టలేం అనే పాతసామెత తెలుసుగదూ, కాని ఇక్కడ అవిరెండూ ఒకేచోట ఉన్నాయి. కలిసే పడుస్తున్నాయి! జర్మన్లపట్ల నాకున్నది అది తీవ్రమైనద్వేషం. వాళ్ళు నా దేశానికీ, నాకు చేసిందానికి నేను వాళ్ళను విపరీతంగా ద్వేషిస్తాను అదే సమయంలో నేను నా ప్రజల్ని ఎంతప్రేమిస్తాను! వాళ్ళను నా హృదయమంతటితోనూ ప్రేమించి, జర్మన్లకాడికింద వాళ్ళెన్నడూ బాధలనుభవించకుండా ఉండాలని ఎంతగా అనుకుంటాను! ఈ లక్షణమే నన్ను అంతకఠోరంగా యుద్ధంచేయడానికి పురికొల్పింది. ఆమాటకొస్తే మన సైనికులందరూఅంతే. ఈ రెండుఅనుభూతులే, మనపనిలో కలిసి సాగినప్పుడు మనం విజయంసాధిస్తాం. మనం మనదేశంపట్ల ప్రేమను గుండెల్లో సజీవంగా నిలుపుకోగలిగితే, ఆ గుండె కదలిక ఆగిపోయేదాకా ఆ అనుభూతి సజీవంగా నిలిచిఉంటే, మన బయొనెట్లకొసల మీద తప్పకుండా ద్వేషం నిలబడుతుంది. ఈ సంగతే నేను చెప్పదలచుకున్నది. కొంచెం సాగదీసి చెప్పానేమో, క్షమించు....' అని ముగించాడు, మేమిద్దరమూ పరిచయమయ్యాక మొదటిసారి గెరాసిమోవ్ అప్పుడో చిరునవ్వునవ్వాడు. పసిపాప లాంటి స్వచ్ఛమైన చిరునవ్వది.

ఈ ముప్పైరెండేళ్ళ లెఫ్టినెంట్ ముఖంనిండా తానుపొందిన భయంకర అనుభవాల గుర్తులున్నాయి. కాని ఓ ఓక్‌చెట్టులాగ ఆయన దృఢంగానే ఉన్నాడు. ఆయన కణతలమీద వెంట్రుకలుమాత్రం తెల్లగా వెండిలాగ మెరిసిపోతున్నాయని నేనప్పుడే గుర్తించాను. ఈ స్వచ్ఛమైన, అద్భుతమైన తెల్లదనాన్ని గెలుచుకోవడానికి ఆయన ఎన్నెన్ని బాధలనుభవించాడో.... ఆయన టోపీనుంచిజారిన సాలీడు గూటి దారానికీ కణతలమీద తెల్లవెంట్రుకలకూ తేడా గుర్తుపడదామని ప్రయత్నించి నేను విఫలమైపోయాను.

# మార్క్స్ జీవితం-సిద్ధాంతం

ప్రాణహిత

అప్పుడు
విశాలంగా విస్తరించిన
ప్రపంచం ముఖంలోకి
తిరస్కారంగా
నా సవాలు విసుర్తాను
.... .... .... .... .... .... ....
.... .... .... .... .... .... ....
సృష్టికర్తకు తీసిపోని హృదయం నాది
ప్రతివాక్కూ ఒక ఆచరణ, ఒక జ్వాల

కార్ల్ మార్క్స్

"తత్వవేత్తలు రకరకాలుగా ప్రపంచాన్ని కేవలం వ్యాఖ్యానించారు. కాని దాన్ని మార్చటమనేది అసలు విషయం." అని మానవసామాజిక జీవితంలో విప్లవంతెచ్చాడు మార్క్స్. పైమాటలు కేవలం అందమైన పదాలకూర్పుగా కాక అక్షరాలావాస్తవం చేసినందుకే మార్క్స్ విప్లవసాధకుడైన మహాతత్వవేత్త అయాడు. ఆయన ఒక్క తత్వశాస్త్రంలోనే కాక అనేకరంగాల్లో బౌద్ధికంగా మాత్రమే కాకుండా, భౌతికంగా కూడ ఈ విప్లవాత్మకమైనమార్పును సాధించాడు. అందుకే చరిత్రలో మనమెరిగిన గొప్పవారిలో ఆయన అరుదైన మహావిజ్ఞానీ, గొప్ప విప్లవకారుడూ.

మార్క్స్ జీవితచరిత్ర ఒకవ్యక్తి జీవితచరిత్రో, ఒకజాతిచరిత్రో కాదు. అది ఒక గొప్ప ఉద్యమచరిత్ర. నాలుగు దశాబ్దాలపాటు యూరప్ఖండంలోని కార్మికవర్గ పోరాటాలలో, ప్రజాతంత్ర ఉద్యమాలతో ఆయన జీవితం విడదీయరాని ముడి వేసు కున్నది. ఒకకొత్త ప్రపంచాన్ని ఆవిష్కరించడానికి జరిగిన ఉద్యమాలు అవి ఈ ఉద్యమాలకు ఆయన అగ్రగామి సిద్ధాంతాన్ని రూపొందించాడు ఏతత్వశాస్త్రంగురించి ప్రపంచంలో మొదటిసారిగా ఒక విప్లవాత్మకమైన అభిప్రాయాన్ని ప్రకటించాడో ఆ తత్వశాస్త్రాన్ని యూరప్ కార్మికవర్గానికి పోరాట సిద్ధాంతంగా అందించిన వీరుడు ఆయన.

యూరప్‌లోని భూస్వామ్య పెట్టుబడిదారీశక్తులు కమ్యూనిస్టుభావాల ప్రచారానికి భయపడడం చూసి యూరప్‌ను "కమ్యూనిజం అనే భూతం" వెంటాడుతోందని మార్క్స్ అన్నాడు. ఈ "కమ్యూనిస్టుభూతం" యూరప్‌ను మాత్రమే వెంటాడడానికి, మార్క్స్‌కృషి పరిమితం కాలేదు. తన జీవితకాలంలోనే ఆసియా, అమెరికా ఖండాల్లోకూడ "కమ్యూనిస్టుభూతం" కాలుమోపడానికి ఆయన ఎంతగానో కృషి చేసాడు. ఈపని చేసినందుకు ఆయనను యూరప్‌లోని భూస్వామ్య బూర్జువాశక్తులు వేటాడివేటాడి ఒకదేశంనుండి మరొకదేశానికి తరిమికొట్టాయి. ఇప్పుడా "కమ్యూనిస్టు భూతం" ప్రపంచమంతటా ఆవరించింది. ఎక్కడికక్కడ భూస్వామ్య బూర్జువా శక్తులు "కల్లోలం"లో కాలుగాలిన పిల్లుల్లా పరుగులు తీస్తున్నాయి,

కాబట్టి మార్క్స్ జీవితాన్ని తెలుసుకోవడమంటే ఈ "కమ్యూనిస్టు భూతం" గురించి తెలుసుకోవడమే. అంటే స్థూలంగా ప్రపంచ విప్లవ కార్మికోద్యమాన్నీ, ప్రధానంగా యూరప్ విప్లవకార్మికోద్యమాన్నీ తెలుసుకోవడం.

ప్రష్యాదేశంలోని ట్రియర్ పట్టణం (ఇప్పుడిది పశ్చిమజర్మనీలోఉంది) లో 1818 మే 5 నాడు మార్క్స్ జన్మించాడు. ఆయన తండ్రిపేరు హెన్రిక్ మార్క్స్ (Heinrich Marx). తల్లిపేరు హెన్రియెట్ ప్రెస్‌బర్గ్ (Henriette Pressburg). ఆ దంపతులకు మొత్తం తొమ్మిదిమంది సంతానం. ఆ కుటుంబంలోని వారందరికీ మార్క్స్ అంటే చాలాఇష్టం. హెన్రిక్ మార్క్స్ ఫ్రెంచి తత్వవేత్తలను బాగా చదివిన విజ్ఞాని. ఆయనకు లిబరల్ రాజకీయ దృక్పథంపట్ల ఆసక్తి.

మార్క్స్ జన్మించిన ట్రియర్ పట్టణం రైన్‌నదీ పరీవాహక ప్రాంతమైన రైన్‌లాండ్‌లోఉంది. 18వ శతాబ్దపు ఫ్రెంచి విప్లవం ఈ ప్రభావంపల్ల ఈ ప్రాంతంలో భూస్వామ్యం తగ్గుముఖంపట్టి పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. ఆ కారణంగా ఈప్రాంతం మార్క్స్ జన్మించిన కాలానికి ఆర్థికంగా, రాజకీయంగా అభివృద్ధి సాధించింది. రైన్‌లాండ్‌మీద జర్మన్, ఫ్రెంచ్ సంస్కృతుల ప్రభావం బాగాఉండేది. ఎంగెల్స్‌కూడ ఇదే ప్రాంతంలో బార్‌మెన్ అనేచోట జన్మించాడు.

మార్క్స్ చిన్నతనంలో ట్రియర్ పట్టణంలో చదివినపుడు ఆ పాఠశాల జీవితంలోనే ఆయన తదనంతరకాలంలో ప్రపంచంతో చేయబోయే పోరాటానికి ప్రారంభరూపమూ, ప్రాథమికరూపమూ కనిపిస్తాయి. ఆయనకు చదువుచెప్పిన ఉపాధ్యాయులలోకొందరికి ఉదారవాద, అభ్యుదయ దృక్పథాలు ఉండడంవల్ల కొంత

మేలే జరిగింది. అయితే కొన్నిసందర్భాల్లో ఆయనకు తెలివైనవిద్యార్థిగా లెక్కింపు రాలేదు. ఆయన తన సమాధానాల్లో వ్యక్తపరిచిన విప్లవభావాలను ఆ ఉపాధ్యాయులు అందుకోలేకపోవడమో, వ్యతిరేకించడమో అందుకు కారణం.

పాఠశాల విద్యాభ్యాసం ముగిసిన తరువాత న్యాయశాస్త్రాన్ని అధ్యయనం చేయడం కొరకు మార్క్స్ బెర్లిన్ విశ్వవిద్యాలయంలో చేరాడు. అక్కడ ఆయనకు "యువ హెగెలియన్ల" (Young Hegelians) బృందంతో సంబంధాలు ఏర్పడ్డాయి. మత, తాత్వికపిడివాదాలను విమర్శించిన "యువ హెగెలియన్లు" హెగెల్ అనుచరుల్లో తీవ్రవాదులు. మార్క్స్‌కు వీరితో సంబంధం ఏర్పడినకాలంలో ఆయన హెగెల్ తత్వశాస్త్రాన్ని చదువుతున్నాడు. తత్వశాస్త్ర అధ్యయనంలో భౌతికవాదం వైపు పోయినాకొద్దీ ఆయన వారికిదూరమై చివరకు వారితో పోరాటంచేయవలసిన స్థితిలోకి కూడ వచ్చాడు.

బెర్లిన్ విశ్వవిద్యాలయంలో విద్యార్థిదశ అయిపోయిన తరువాత బోధనా వృత్తిలో ప్రవేశించాలనుకున్న మార్క్స్ ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాడు. అభ్యుదయభావాలున్న ఉపాధ్యాయులమీద ప్రష్యన్ ప్రభుత్వం తీవ్రమైన నిర్బంధాన్ని కొనసాగించడంచూసి, ప్రొఫెసర్ కావాలన్న ఆశను వదులుకుని, మార్క్స్ పత్రికారంగంలోకి వ్యాసరచయితగా ప్రవేశించాడు. 1842లో ఆయన మొదటిసారిగా ప్రష్యన్ ప్రభుత్వం పత్రికలమీద అమలుచేస్తున్న సెన్సార్‌షిప్‌ను ఖండిస్తూ వ్యాసం రాసి "రైనిష్కెసైటుంగ్" (Rheinische Zeitung) లో ప్రచురించాడు.

విప్లభావప్రచారానికీ, విప్లవోద్యమ ప్రయోజనాలకూ తన జీవితకాలంలో మార్క్స్ ఎన్నో పత్రికలను వాడుకున్నాడు. పత్రికలను స్థాపించాడు. ఈ విధంగా ఆయన వాడుకున్న మొదటిపత్రిక "రైనిష్కెసైటుంగ్" పత్రికా స్వేచ్ఛమీద రాయడంతో మొదలుపెట్టి అనేక విషయాలగురించి ఆయన ప్రచురించిన విప్లవాత్మక వ్యాసాలు గొప్పసంచలనాన్ని కలిగించాయి. త్వరలోనే ఆ పత్రిక సంపాదకత్వ బాధ్యతను ఆయన తీసుకున్నాడు. ఆయన సంపాదకత్వంలో ప్రజాతంత్ర భావ ప్రచారానికి బాగా ఉపయోగపడుతున్న ఆ పత్రికమీద ప్రష్యన్‌ప్రభుత్వం సెన్సార్‌షిప్ నిర్బంధాన్ని రోజురోజుకూ కఠినతరం చేసింది. ఆ ఆ పత్రికను కాపాడుకోవ డానికి 1843 మార్చిలో తన సంపాదకత్వానికి మార్క్స్ రాజీనామా చేసాడు. అయినా ఏప్రిల్‌లో ఆ పత్రికను ప్రభుత్వం నిషేధించింది.

ప్రకృతికి సంబంధించి డెమోక్రిటస్, ఎపిక్యూరస్‌ల తత్వశాస్త్రాల మధ్య ఉన్నభేదాన్ని పరిశీలనచేస్తూ 1841లో డాక్టరేట్ డిగ్రీ కొరకు మార్క్స్ చేసిన రచన తత్వశాస్త్రంలో ఆయన కృషికి మొదటిసారిగా ఏర్పడిన ఒకరూపం. అంతకుముందే ఆయన హెగెల్ తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేసాడు. హెగెల్‌ను అధ్యయనం చేయడానికిముందు ఆయనమీద జర్మన్ తత్వవేత్తలైన కాంట్, ఫిష్టేల ప్రభావం ఉండేది. తరువాతి కాలంలో జర్మన్ తత్వవేత్తలనే కాక మొత్తం యూరప్‌ఖండంలో తన కాలానికున్న తత్వవేత్తలందరినీ ఆయన కాచి వడపోసాడు. అంతవరకు తత్వ వేత్తలందరూ ప్రపంచాన్ని సరిగా అర్థం చేసుకోలేక చీకట్లో చిందులువేస్తుండగా తత్వశాస్త్రానికి మొదటిసారిగా ఆయన సరియైన మార్గాన్నీ, వెలుగునూ ఇచ్చాడు. తత్వ శాస్త్రానికి వెలుగునూ. వేకువనూ సంతరించి పెట్టడంలో ఆయన చూపిన ప్రతిభా పాటవాలు సాటిలేనివి. ఆలోచనలో ఆయన విపరీతమైన చురుకుదనం కలవాడు. ఎంగెల్స్‌ను మినహాయించి భావసారూప్యత కలిగిన మిత్రులు ఈ విషయంలో ఎప్పటికప్పుడు ఆయనతో వెనకబడేవారు. ఆయనలో రూపొందుతున్న శాస్త్రీయకమ్యూ నిస్టుభావాలే ఈ వేగానికీ, ప్రతిభకూ కారణం. మార్క్స్ కంటెముందు యూరప్ లోనూ, ప్రపంచంలోనూ భౌతికవాదులైన తత్వవేత్తలు ఎంతో మందిఉన్నారు. వాళ్లందరూ ప్రపంచాన్ని తమ దృక్పథాలతో కేవలం వ్యాఖ్యానించడం మాత్రమే చేసారు. వారికి భిన్నంగా భౌతికవాదాన్ని గతితర్కంతోనూ, చరిత్రతోనూ అన్వయించి తత్వవేత్తలు ప్రపంచాన్ని మార్చాలవడంలో, అందుకు ప్రయత్నించడంలో మార్క్స్ గొప్పతనమంతా ఇమిడిఉంది. 1835లో బాన్ విశ్వవిద్యాలయంలో చదువుతున్నపుడు భౌతికవాదిగా ఉన్న మార్క్స్ ఫ్రెంచ్ భౌతికవాదంలోని ఊహాస్వర్గ సోషలిజాన్నీ, కమ్యూనిజాన్నీ సూక్ష్మంగా అధ్యయనంచేసి శాస్త్రీయ కమ్యూనిజాన్ని రూపొం దించుకునేసరికి ఒక దశాబ్దకాలంపట్టింది. ఇక అప్పటినుండి ఆయన యుగసృష్టి కావించగల రచనలుచేసాడు. సామాజిక జీవితానికిచెందిన పునాదిలో, ఉపరితలంలో నిత్యం జరుగుతున్న మార్పులమీద ఆ రచనలు నిరంతరాయంగా ప్రభావాన్ని వేస్తున్నాయి.

మార్క్స్‌చేసిన ఈ బృహత్తరమైనపనిలో ఎంగెల్స్ మొదటినుంచీ సహక రించాడు. మానవజాతి చరిత్రలో వీరిద్దరిమైత్రి చాలాఅపూర్వమైంది. "రైనిష్కె సైటుంగ్" పత్రిక కార్యాలయంలో మార్క్స్‌ను ఎంగెల్స్ మొదటిసారిగా 1842లో కలిసాడు. తరువాత 1844లో పారిస్‌లోఉన్న మార్క్స్‌తో ఎంగెల్స్ కొన్నిరోజులు

కలిసికున్నాడు. ఈ సన్నివేశం వారిద్దరిజీవితాల్లోనే కాకుండా ప్రపంచచరిత్రలోకూడా ఒక విశిష్టమైన ఘటనగా నిలిచింది. వాళ్లు కలిసిఉన్న ఆ కొద్దిరోజుల్లో తమ భావాల్లోనూ, దృక్పథంలోనూ ఐక్యతఉందని తెలుసుకున్నారు. ఇకముందు తామిద్దరూ కలిసి రాయాలనీ, పనిచేయాలనీ అనుకున్నారు. ఈ మైత్రీబంధం వారి జీవితకాలమంతా నిలిచింది. నాలుగు దశాబ్దాలపాటు మార్క్స్ చేసిన రచన లన్నింటిలో ఎంగెల్స్ సహకారం పూసల్లో దారంలా ఇమిడిఉంది. ఇద్దరు కలిసిచేసిన రచనలు సరే సరి. గతితార్కికదృక్పథంతో నిండిఉన్న ఈ రచనలన్నీ ఆనాటి యూరప్ మేధావులనూ, తత్వవేత్తలనూ తీవ్రంగా కలవరపెట్టాయి. ఈ రచనల్లోని విప్లవభావాలు భౌతికశక్తిగా కార్మికవర్గ ఆచరణలో కనిపించి యూరప్‌ఖండాన్ని కుదిపివేసాయి.

తాత్విక విప్లవంలో మార్క్స్ మొట్టమొదట సాధించిన ప్రధాన విజయం హెగెల్ భావవాదాన్ని విమర్శించడంలో ఉంది. భావవాదగతితర్కం కారణంగా హెగెల్ తన తత్వశాస్త్రంలో ప్రపంచాన్ని తలకిందులుగా నిలిపి వ్యాఖ్యానించాడు. భావవాద గతితర్కాన్ని భౌతికవాద గతితర్కంగా మార్చి ప్రపంచాన్ని శాస్త్రీయంగా విశ్లేషించి, దాన్నిమార్చవలసిన అవసరాన్ని మార్క్స్‌చాటాడు. మార్క్స్ హెగెల్‌ను విమర్శించడం 1842 లోనే ప్రారంభించాడు. తమ మైత్రి స్థిరపడిన తరువాత మార్క్స్, ఎంగెల్స్‌లు ఆత్మాశ్రయ. భావవాదులైన "యువ హెగెలియన్ల" మీదదాడి చేయాలని నిర్ణయించారు. ఆదాడి "పవిత్రకుటుంబం (The Holy Family)" అన్న రచనగా 1845లో వెలువడింది. తత్వశాస్త్రంలో భావవాద భౌతికవాదాలు రెండు ప్రధానమైనధోరణులు. ఈ రెంటిమధ్య నిరంతరంఘర్షణ సాగుతున్నదని తత్వశాస్త్ర చరిత్రను వివరిస్తూ మార్క్స్ ఈ రచనలో చెప్పాడు. విరుద్ధాంశాలమధ్య ఐక్యత, ఘర్షణ ఉంటుందనే గతితర్కాన్నికూడా ఆయన ఇందులో వివరించాడు. పెట్టుబడి దారీ వర్గానికీ, కార్మికవర్గానికీమధ్య శత్రువైరుధ్యం ఉంటుంది. పెట్టుబడిదారు పెట్టుబడిదారీ వ్యవస్థను కాపాడాలని ప్రయత్నిస్తాడు. కార్మికుడు దాన్నిధ్వంసంచేయాలని చూస్తాడు. అయితే వీళ్లిద్దరూ పెట్టుబడిదారీ వ్యవస్థనుంచి వచ్చినవాళ్ళే. ఇది విరుద్ధస్వభావాలుగల వీళ్లిద్దరిమధ్య కనిపించే సాపేక్షికమైన ఐక్యత. వీళ్లిద్దరి మధ్య ఉన్న వైరుధ్యాన్ని కార్మికవర్గవిప్లవం తొలగిస్తుంది. విప్లవంకొరకు కార్మికవర్గం చేసే పోరాటఆచరణ సామాజిక ఆర్థికపరిస్థితుల నేపథ్యంలో ఉంటుంది.

ఎంగెల్స్‌తోకలిసి పనిచేయడానికంటె ముందుగానే మార్క్స్ "1844వ సంవత్సరపు ఆర్థిక తాత్వికవ్యాసాలు (Economic and Philosophical Manu-

scripts of 1844)" అన్న రచనను పూర్తిచేసాడు. 1930 లలో మొదటిసారిగా పుస్తకరూపంలోకి వచ్చిన ఈ రచనలోని వ్యాసాలు 1844 ప్రాంతంలో మార్క్స్ వివిధపత్రికల్లో రాసాడు. ఆయనలో శాస్త్రీయ కమ్యూనిజం భావాలు రూపొందిన తరువాత వెలువడిన మొట్టమొదటి ముఖ్యమైన రచనఇది. ఇందులో ఆయన వెలిబుచ్చిన ఆర్థిక తాత్వికదృక్పథాలు శాస్త్రీయమైన మార్గంలోఉన్నాయి. అందువలన మనం శాస్త్రీయప్రాపంచిక దృక్పథం జన్మించిన సంవత్సరంగా 1844ను చెప్పుకోవచ్చు.

ఈ రచనలో ప్రధానంగా చెప్పబడినఅంశం ఉత్పత్తినుండి శ్రామికుని పరాయీకరణ. "మానవుని విలక్షణగుణం శ్రమ. కానీ శ్రమచేసేకార్మికుడు తన కోసం తాను ఉత్పత్తి చేయడంలేదు. యజమానికోసం చేస్తున్నాడు. అంతేగాక, ఫ్యాక్టరీలో శ్రమచేసే కార్మికుడు మనిషిలాగాకాక, యంత్రంలాగా శ్రమచేస్తున్నాడు. నిద్రాహారమైథునాల్లాంటి జంతుధర్మాల్లో మాత్రమే మానవుడు స్వేచ్ఛగా, బుద్ధిపూర్వకంగా, సంతోషమయంగా వ్యవహరిస్తున్నాడు. శ్రమలోస్వేచ్ఛా, ఇష్టమూ, సంతోషమూ వుండడంలేదు. కనుక మానవుడు మానవత్వానికి దూరమవుతున్నాడు. లేక, తనకుతాను అన్యుడౌతున్నాడు (Self Alienation of Man)". మార్క్స్ ఈ వ్యాసాల్లో చెప్పిన కొన్నిభావాలను అభివృద్ధిచేసి తన "పెట్టుబడి" గ్రంథంలోకూడా చెప్పాడు. శ్రామికుడు పొందుతున్న పరాయీకరణ సరుకుపరాకయీరణగా "పెట్టుబడి"లో కనిపిస్తుంది. కార్మికుడు తనశ్రమచేత ఉత్పత్తి చేసిన సరుకునుండి తానే దూరమవుతున్నాడు. ఈ పరాయీకరణకు సొంతఆస్తి కారణం. ప్రపంచంలో ఒక వైపు ఆర్థికసంపద పోగుపడుతుండగా మరొకవైపు దారిద్ర్యం పెరగడానికికూడ ఈ సొంతఆస్తే కారణం. శ్రామికుని దారిద్రమూ, పరాయీకరణా తొలిగిపోవాలంటే సొంతఆస్తి రద్దుకావాలి. సొంతఆస్తిగల వ్యవస్థను రద్దుచేయడంద్వారా జరిగే కార్మికవర్గ విప్లవంలోనే ప్రపంచ మానవులందరి విముక్తి కలిసిఉంటుంది.

"రైనిష్కె-సైటుంగ్" పత్రిక నిషేధానికి గురయిన తరువాత మార్క్స్, ఎంగెల్స్‌లు పారిస్‌నుండి వెలువడే "వోర్‌వార్ట్స్ (Vorwarts)" పత్రికలో వ్యాసాలు రాయడం ప్రారంభించారు. కార్మికవర్గాన్ని పోరాటపథం వైపునడిపించే విప్లవాత్మకమైన వ్యాసాలను మార్క్స్ రాస్తున్నందువల్ల ఫ్రెంచ్ ప్రభుత్వం ఈ పత్రికను నిషేధించింది, ప్రష్యన్ ప్రభుత్వం తెచ్చిన ఒత్తిడివల్ల ఫ్రెంచ్ ప్రభుత్వం మార్క్స్‌ను పారిస్ నుండి 1845 జనవరిలో బహిష్కరించిందికూడ. మార్క్స్

పారిస్‌నుండి బెల్జియం రాజధానినగరం బ్రస్సెల్స్‌కువెళ్ళాడు. అక్కడకూడ ఆయనను ప్రష్యన్ ప్రభుత్వం వేటాడడంమానలేదు. ఆయనను బహిష్కరించడానికి బెల్జియం మీదకూడ ఒత్తిడితెచ్చింది. దీనినుండి తప్పించుకోవడానికి 1845 డిసెంబర్‌లో మార్క్స్ తన ప్రష్యన్ పౌరసత్వాన్ని వదులుకున్నాడు.

బ్రెస్సెల్స్‌లో ఉండగా ఎంగెల్స్ సహకారంతో మార్క్స్ "జర్మన్ భావజాలం (German Ideology)" అన్న రచనను పూర్తిచేసాడు. ఇది 1932లో మొదటిసారి అచ్చయింది. ఇందులో జర్మన్ తత్వవేత్తల గ్రంథాలను పరిశీలించి, వాటిలోని వివిధధోరణులను, విశ్లేషించడం జరిగింది. తాను నిజమైన కమ్యూనిస్టునని ప్రకటించుకున్న ప్యూర్‌బా నూ, "నిజమైన సోషలిస్టుల (True Socialists)" మని పేరు పెట్టుకున్నవారినీ, ఇతరులనూ కూలంకషంగా పరిశీలించి, ఈ రచనలో మార్క్స్ వాళ్ళస్థానాన్ని నిర్ణయించాడు. సామాజికాభివృద్ధికిచెందిన ప్రధానసిద్ధాంత మైన చారిత్రక భౌతికవాదాన్ని ఆయన ఇందులోచెప్పాడు. భౌతికవాదానికి చరిత్రను అన్వయించిన సిద్ధాంతం ఇది. ప్రతి చారిత్రికదశలోనూ ఆర్థికరంగంలో జరుగుతున్న ఉత్పత్తి మీద ఆధారపడి నిర్దిష్టమైన ఉత్పత్తి సంబంధాలుగల సామాజిక నిర్మాణం ఏర్పడుతుంది. ఆ చారిత్రకదశలోని రాజకీయ, బౌద్ధిక జీవితానికి ఈ సామాజిక నిర్మాణమేమూలం. ఉత్పత్తి సంబంధాలు వర్గస్వభావాన్ని కలిగిఉండడంవల్ల మానవ జాతి చరిత్ర అంతా దోపిడీచేసేవాళ్ళకూ చేయబడుతున్న వాళ్ళకూ, పాలకులకూ పాలితులకూ మధ్య జరుగుతున్న వర్గపోరాటాల చరిత్రగానేఉంది. ఈ పోరాట క్రమంలో ఈనాడు కార్మికవర్గం దోపిడీదారులనుండి మొత్తం ప్రపంచాన్ని విముక్తం చేయకుండా తాను విముక్తి పొందలేని దశకుచేరుకుంది. ఈవిముక్తిని సాధించడానికి విప్లవం అవసరం. పాలకవర్గాన్ని అధికారం నుండి తొలగించి రాజ్యాధికారాన్ని కార్మికవర్గంచేతిలో పెట్టేమార్గంలో ఈ విప్లవం కొనసాగుతుంది.

మార్క్స్ ఈ గ్రంథంలో మానవజాతి అనుభవంలోకి భవిష్యత్తులో రానున్న కమ్యూనిస్టు సమాజపు విశాలరేఖా చిత్రాన్నికూడఇచ్చాడు. కమ్యూనిజంలో ఉత్పత్తి సాధనాలమీద సమిష్టి యాజమాన్యమేగాని, వ్యక్తి యాజమాన్యం ఉండదు. ఈ సమా జంలో వర్గవిభజన ఉండదు కాబట్టి ఒక వర్గంమీద మరొకవర్గం అధికారం చలా యించడంగానీ, అందుకొరకు రాజ్యాంగయంత్రం యొక్క అవసరంగానీ ఉండదు. మనుషులమధ్య వృత్తివిభజనఉండదు. శారీరక, మానసికశ్రమల మధ్య వ్యత్యాసం

మాసిపోతుంది. ఒకమనిషి జీవితాంతం ఒకేవృత్తినిమాత్రమే చేయువలసిన నిర్బంధం ఉండదు. శ్రమచేయడం బలవంతంగా కాక స్వేచ్ఛామానవుల సహజ వ్యాపారంగా మారుతుంది.

ప్రౌధాన్ అనే ఒకతత్వవేత్త సమాజంలోని ఆర్థిక వైరుధ్యాలను పరిశీలిస్తూ "దారిద్ర్య తత్వశాస్త్రం (The philosophy of Poverty)" అన్న పేరుతో 1846లో ఒకగ్రంథాన్ని రాసాడు. ఈ గ్రంథంలో ప్రౌధాన్ పరిశీలన సరియైనపద్ధతిలో సాగలేదు. ఆయనది కేవలం సంస్కరణవాదం. వాస్తవపరిస్థితులను సరిగా అర్థంచేసుకోకుండా చికిత్స చేయబూనుకున్న సంస్కరణవాదంఅది. సమాజంలో పేదరికానికి మూలం సొంతఆస్తికాదని అతనివాదన. అంటే వర్గసమాజంగానీ, ఆ సమాజంలోని దోపిడీగానీ పేదరికానికి కారణంకాదనిఅర్థం. సమాజంలో జరుగుతున్న ఉత్పత్తిని పంపిణీచేయడంలో సమానత్వం లేకపోవడంవల్ల పేదరికం ఏర్పడిందని ప్రౌధాన్ అన్నాడు. పంపిణీలోఉన్న అవకతవకలను తొలగిస్తే సమస్య తీరుతుందని అతని అభిప్రాయం.

మార్క్సు ఈ గ్రంథాన్నిచదివి, తత్వశాస్త్రంలో ప్రౌధాన్ తెలివితేటలు ఎంత దరిద్రంగా ఉన్నాయో వివరిస్తూ "తత్వశాస్త్రదారిద్ర్యం (The Poverty of-Philosophy)" అని 1847లో ఒక రచనచేసాడు. ఈ రచన చేయడానికి పూర్వం మార్క్సు రచనలన్నీ ఒకటి రెండు మినహాయింపులతో, ప్రధానంగా తత్వశాస్త్రానికి చెందినవే. అందుకని ఆయన అంతవరకు తత్వవేత్తగానే పేరుపొందాడు. ఈ రచన చేయడంతో, ఆర్థికరంగంలోకూడా ఆయన తనప్రతిభను చాటుకున్నాడు.

ఉత్పత్తి చేయబడిన వస్తువులో ఇమిడిఉన్న మానవశ్రమే ఆ వస్తువుకు విలువను కలిగిస్తుంది. ఉత్పత్తిలో కార్మికుడు ఉపయోగించిన శ్రమమొత్తం ఈ విలువను నిర్ణయిస్తుంది. ఉత్పత్తికి అవసరమయిన ఉత్పత్తిశక్తుల్లో ఉత్పత్తి సాధనాలతోపాటు కార్మికులుకూడ ఉంటారు. విప్లవాత్మకమైన కార్మికవర్గమే గొప్ప ఉత్పత్తిశక్తి.

"జర్మన్ భావజాలం"లో తానుచెప్పిన అంశాల్లో కొన్నింటిని మార్క్సు ఈ రచనలో విపులీకరించాడు. అందులో గతితర్కంఒకటి. హెగెల్ తనగతితర్కాన్ని ఆలోచనకూ, బుద్ధికీమాత్రమే పరిమితంచేసే భావవాదంలోకి పోయాడు. మార్క్సు దాన్ని భౌతికప్రపంచానికి అన్వయించి, సామాజిక అభివృద్ధిలో ఇమిడి ఉన్న

అంశంగా గుర్తించాడు. ఈ భౌతిక ప్రపంచానికి ప్రతిబింబంగా భావాలూ, ఆలోచనలూ అభివృద్ధి చెందుతాయి. భౌతికప్రపంచంలోఉన్న వర్గవైరుధ్యాలు ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తిసంబంధాలకూమధ్య ఘర్షణతెస్తాయి. విరుద్ధస్వభావాలుగల వర్గాలమధ్య ఐక్యతఉంటూనే ఘర్షణతలెత్తుతుంది. సంఖ్యాత్మకమైన అభివృద్ధి గుణాత్మకమైన అభివృద్ధిగా, పరిణామం విప్లవంగా మారుతుంది.

పరిణతిచెందిన మొదటి మార్క్సిస్టురచనలలో "తత్వశాస్త్ర దారిద్ర్యం"ఒకటని లెనిన్ అన్నాడు.

ఈ గ్రంథం తరువాత "వేతనకూలీ మరియు పెట్టుబడి (Wage Labour and Capital) అన్న మార్క్స్ రచన ఆర్థికరంగానికి సంబంధించి మరో ముఖ్యమైన రచన. తదనంతరకాలంలోని "కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక(The Manifesto of Communist Party)"లో పెట్టుబడి, కూలిపనులగురించి తానుచెప్పిన విషయాలకు ప్రాథమికరూపం ఈ రచనలో కనిపిస్తుంది. కార్మికునిదగ్గర ఉత్పత్తికి అవసరమైన శ్రమశక్తి ఉంటుంది. ఆ శ్రమశక్తిని పెట్టుబడిదారుకు అమ్మకుని వేతనరూపంలో కార్మికుడు ప్రతిఫలాన్ని పొందుతాడు. అందువల్ల కార్మికుడు వేతనకూలే అవుతున్నాడు. వేతనకూలీ తనశ్రమను పెట్టుబడిదారుకు తప్పనిసరిగా అమ్మకోవాలి. లేకపోతే అతడు, అతనికుటుంబం బతకదు, వేతనకూలీకి తనశ్రమను ఒక పెట్టుబడి దారుకు కాకుంటే మరో పెట్టుబడిదారుకు అమ్మకోవడంతప్ప స్వేచ్ఛ అంటూ ఏమీఉండదు. కాబట్టి పెట్టుబడిధారీ సమాజంలో స్వేచ్ఛఅన్నది ఒక వంచన లేదా భ్రమ మాత్రమే.

ప్రపంచ చరిత్రలో 1840ల చివరిసంవత్సరాలు మరపురానివి. 1847లో ఫ్రాన్స్, జర్మనీ, బెల్జియం, బ్రిటన్, అమెరికాదేశాలలో తీవ్రమైన ఆర్థికసంక్షోభం ఏర్పడడంతో ప్రజలు ఆకలి తిరుగుబాట్లుచేసారు. పెట్టుబడిదారీవ్యవస్థకు వ్యతిరేకంగా వచ్చిన ఈ విప్లవ వెల్లువలో కార్మికవర్గం చురుకుగా పాల్గొంది. అప్పటికే లీగ్ ఆఫ్ జస్ట్ (League of the Just)" అన్న సంస్థ కార్మికుల్లో విప్లవభావాలను రహస్యంగా ప్రచారంచేస్తున్నది. ఇది 1847లో జూన్‌లో కమ్యూనిస్ట్ లీగ్ (Communist League)" అని తనపేరును మార్చుకున్న కాలానికి మార్క్స్, ఏంగెల్స్‌లు అందులో సభ్యులు· నిజానికి "లీగ్ ఆఫ్ జస్ట్" "కమ్యూనిస్ట్ లీగ్"గా మారడం వెనుక వీళ్లిద్దరి కృషిఉంది. దీని రెండవ మహాసభ 1847 నవంబర్ డిసెంబర్‌లలో లండన్‌లో జరిగింది. విప్లవకార్మికశ్రేణులకు ఆచరణయోగ్యమైన

ఒక ప్రణాళికను రచించమని ఈ మహాసభ వీళ్ళిద్దరినీ కోరింది. ఆ కోరికమీదనే మార్క్సు, ఎంగెల్సులు "కమ్యూనిస్టుపార్టీ ప్రణాళిక"ను రచించారు. ఇది మొదటి సారిగా 1848 ఫిబ్రవరిలో లండన్‌లో జర్మన్ భాషలో అచ్చయ్యింది. ఆనాటినుంచి ఈనాటివరకు ఆ చిన్నపుస్తకం ఎన్నిభాషల్లోకి అనువదించబడిందో, ఒక్కొక్క భాషలో ఎన్నెన్ని ముద్రణలను పొందిందో, కమ్యూనిస్టు ఉద్యమంమీద దాని ప్రభావం ఏపాటిదో ప్రత్యేకంగా పరిశోధనచేసి చెప్పవలసినంత విషయం.

మార్క్సిస్టు ప్రాపంచికదృక్పథమూ, ఆ దృక్పథంతో కార్మికవర్గం విప్లవ పోరాటాల్ని నిర్వహించే తీరూ ఈ ప్రణాళిక"లో సూక్ష్మంగా చెప్పబడ్డాయి. శ్రామికవర్గ నియంతృత్వాన్నీ, కమ్యూనిజం ప్రధాన లక్షణాలనూ, శ్రామికవర్గపార్టీ సిద్ధాంతాన్నీ, సామాజిక చరిత్రగమనాన్నీ నిర్దిష్టంగానూ, ఖచ్చితంగానూ ఈ "ప్రణాళిక" వెల్లడిచేసింది. యూరప్ ఖండంలో ఆకాలానికి ప్రచారంలో ఉన్న రకరకాల సోషలిజాల రంగును బట్టబయలుచేసి, కమ్యూనిస్టుల వైఖరిని ఇది స్పష్టం చేసింది. "ఇంతవరకు నడచిన సమాజపు చరిత్ర అంతా వర్గపోరాటాల చరిత్రే" నని చరిత్రపట్ల నిర్ద్వంద్వమైన అభిప్రాయాన్ని వెల్లడించి, పెట్టుబడిదారీవ్యవస్థ మూలాలనూ, దోపిడీనీ, దాని అనివార్య పతనాన్నీ ఈ "ప్రణాళిక" విశ్లేషించింది.

పెట్టుబడిదారు తన పెట్టుబడితో ఉత్పత్తి సాధనాలమీద అధికారాన్ని పొంది కార్మికుని చేత కూలిపని చేయించుకుంటున్నాడు. ఆ విధంగా కార్మికుని శ్రమను దోపిడీచేసి, అదనపు విలువను వ్యక్తిగత లాభంరూపంలో పొందుతున్నాడు.

అయితే పెట్టుబడిదారీ ఉత్పత్తి వ్యక్తిగత మయినదికాదు. అది సామాజిక మయినది. కాని ఉత్పత్తి అయిన సరుకుమాత్రం వ్యక్తి ఆస్తిగామారుతుంది. ఉత్పత్తి సాధనాలమీద స్వంతయాజమాన్యం ఉండడం దీనికికారణం. అందువల్ల ఇతరులను కూలివాళ్లగా మార్చే అవకాశాన్నీ హక్కునూ ఇస్తున్న స్వంతఆస్తిని రద్దుచేయడ మే కమ్యూనిస్టుల లక్ష్యం. కాబట్టి సమాజంలో అత్యధికసంఖ్యలో వున్నకార్మికుల ఉమ్మడి ప్రయోజనాలే కమ్యూనిస్టుల ప్రయోజనాలు.

"కమ్యూనిస్టు సమాజంలో ఒకడు యజమాని అనీ, ఒకడు కూలివాడు అనీ భేదం వుండదు; పెట్టుబడివుండదు, కూలిపనీవుండదు. నిజానికిపెట్టుబడీ, కూలిపనీ అనేవి విడదీయరానివి. ఒకటి వున్నప్పుడే మరొకటి వుంటుంది. ఒకటి లేకుండా మరొకటి వుండజాలదు. కాబట్టి పెట్టుబడిని రద్దు చేయడం అంటే కూలిపనిని కూడా రద్దు చేయడమే."

ఈ లక్ష్యాన్ని, ప్రయోజనాలను సాధించడంకొరకు అవసరమైన రాజ్యాధికారాన్ని పొందడానికి కమ్యూనిస్టులు కార్మికులనూ, ఇతర పీడితప్రజలనూ విప్లవోద్యమంలో సంఘటితం చేస్తారు. "చరిత్రలో యింతవరకు జరిగిన ఉద్యమాలన్నీ అల్పసంఖ్యాకుల ప్రయోజనాలకొరకు జరిగిన ఉద్యమాలు. ఈనాటి కార్మికవర్గ ఉద్యమం అత్యధికసంఖ్యాకుల ప్రయోజనాలకొరకు అత్యధికసంఖ్యాకులు బుద్ధిపూర్వకంగా, స్వతంత్రంగా నడిపేఉద్యమం."

ఈ ఉద్యమం ఫలితంగా కార్మికవర్గ నియంతృత్వం స్థాపించబడుతుంది. దీన్నే సోషలిస్టుదశ అంటారు. ఈదశలో సమస్త పీడిత ప్రజల ప్రయోజనాలకొరకు ఇదివరకు పాలకులుగా ఉన్నవాళ్లమీద కార్మికవర్గ నియంతృత్వాన్ని అమలుచేయడం జరుగుతుంది. ఈ నియంతృత్వాన్ని అమలుచేయడానికి రాజ్యాంగయంత్రం అవసరమవుతుంది. ఈ రాజ్యాంగయంత్రం పాతరాజ్యాంగయంత్రం వంటిదికాదు. పెట్టుబడి దారీ రాజ్యాంగయంత్రం అల్పసంఖ్యాకుల ప్రయోజనాలను నెరవేర్చడానికి ఉన్నందువల్ల అది అత్యధిక సంఖ్యాకులమీద అణచివేతను ప్రయోగిస్తుంది. కార్మికవర్గ రాజ్యాంగయంత్రం అత్యధికసంఖ్యాకుల ప్రయోజనాలను రక్షించడానికి ఉన్నందువల్ల అది అల్పసంఖ్యాకులను నిర్బంధిస్తుంది. మాజీపాలకవర్గం తన వర్గస్వభావాన్ని పోగొట్టుకుని ప్రజలందరితో కలిసేవరకూ, సమాజం కమ్యూనిస్టుదశకు చేరుకోవడానికి అవసరమయినంతగా ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందేవరకూ, సామాజిక ఆర్థిక సాంస్కృతిక రంగాలు తగినంతగా ప్రగతిని సాధించేవరకూ కార్మికవర్గ నియంతృత్వం అవసరమవుతుంది. అంటే రాజ్యాంగయంత్రం శక్తివంతంగా ఉంటుంది. సమాజం సోషలిస్టుదశనుంచి కమ్యూనిస్టుదశకు చేరుకోవడానికి కావలసిన అభివృద్ధిని సాధించినాకొద్దీ రాజ్యాంగయంత్రంయొక్క అవసరంకూడా తగ్గిపోతూ క్రమంగా బలహీనమవుతుంది. అందువల్ల పెట్టుబడిదారీవ్యవస్థలో రాజ్యాంగయంత్రాన్ని వ్యతిరేకించే కమ్యూనిస్టులే కార్మికవర్గ నియంతృత్వంలో రాజ్యాంగయంత్రాన్ని శక్తివంతంచేస్తారనే విమర్శ పొసగదు.

1848-'49 సంవత్సరాల్లో యూరప్‌లో జరిగిన ప్రజల తిరుగుబాట్లకు రాజకీయ స్వభావం ఏర్పడింది. యూరప్ కార్మికవర్గం ఒక రాజకీయశక్తిగా బలపడింది. పెట్టుబడిదారీవ్యవస్థను కూలదోయడానికి విప్లవంలో కార్మికవర్గం నిర్వహించవలసిన పాత్రగురించి మార్క్స్ అనేక వ్యాసాలురాసి బాగా ప్రచారంచేసాడు 1848లో తానే స్థాపించిన "నోయె రైనిషె సైటుంగ్ (Neue Rheinische Zeitung)" పత్రి

కను ఈ ప్రచారంకొరకు మార్క్స్ చక్కగావాడుకున్నాడు. విప్లవ భావప్రచారానికి మొదటినుంచి ఆయన పత్రికలను ఎంతగానో ఉపయోగించుకున్నాడు. పత్రికాస్వేచ్ఛ గురించి గొంతుచించుకునే పెట్టుబడిదారీ ప్రభుత్వాలు మార్క్స్‌మీదా, విప్లవపత్రికల మీదా తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించాయి, పత్రికలను నిషేధించాయి. ఈనాటికీఉన్న పరిస్థితి ఇదే. తీవ్రనిర్బంధంమధ్యకూడా వీలున్నంతవరకు ఏదో ఒక రూపంలో పత్రికలనుంచి విప్లవప్రయోజనాలను పొందడానికి మార్క్స్ ప్రయత్నం చేసాడు. లండన్‌లో దుర్భరదారిద్ర్యాన్ని అనుభవిస్తున్నకాలంలో ఆయన "న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్ (New York Daily Tribune)"కు వ్యాసాలు రాసేవాడు. అప్పుడుకూడ తన ఆర్థికపరిస్థితిని మెరుగుపరుచుకోవడానికైనాసరే ఆయన విప్లవ ప్రయోజనం నెరవేరని వ్యాసాలు రాయలేదు. ఆయన ఆ పత్రికకు రాసిన వ్యాసాల్లో యూరప్‌ఖండంలోని ప్రభుత్వాల అభివృద్ధి నిరోధక స్వభావాన్ని బట్టబయలుచేసాడు. భారతదేశంలో బ్రిటిష్ వలసపాలకులు చేస్తున్న దోపిడీని పాశ్చాత్య ప్రపంచానికి వివరించాడు. చైనాలోని తైపింగ్ ఉద్యమాన్నీ, స్పెయిన్‌కు వ్యతిరేకంగా లాటిన్ అమెరికాదేశాలు చేస్తున్న పోరాటాలనూ రష్యాలోతలెత్తిన ఉద్యమాన్నీ ఆ వ్యాసాల్లోవివరించి, వాటిగురించి పాశ్చాత్యప్రపంచంలోని విప్లవ ప్రజానీకానికి ఒక అవగాహన కలిగించారు.

యూరప్‌లో చెలరేగిన విప్లవోద్యమాన్ని సంఘటిత పరుస్తున్నందుకు పెట్టుబడిదారీ ప్రభుత్వాలు మార్క్స్‌ని ఒకదేశం నుండి మరోదేశానికి తరిమికొట్టాయి. బెల్జియం ప్రభుత్వం 1847లో ఆయననూ, ఆయనభార్య జెన్నీనీ జైలులోనిర్బంధించి, ఆ తరువాత మార్క్స్‌ని బ్రసెల్స్ నుంచి బహిష్కరించింది. ఆయన బ్రసెల్స్ నుంచి జర్మనీలోని కొలోన్ పట్టణానికి వెళ్లాడు. 1849లో జర్మనీ ప్రభుత్వంకూడ ఆయనను బహిష్కరించింది. మార్క్స్ మళ్ళీ పారిస్ చేరుకున్నాడు. ఫ్రాన్స్ ప్రభుత్వం ఆలస్యం చేయకుండా ఆయనను రెండోసారి బహిష్కరించింది. 1849లోనే మార్క్స్ పారిస్ నుండి లండన్‌కు పోయాడు. అక్కడే జీవితాంతం వరకు ఉన్నప్పటికీ ఏ దేశపౌరసత్వాన్నీ తీసుకోలేదు. తాను ప్రపంచపౌరున్ననే భావన ఆయన కుండేది. విప్లవభావాలను ప్రచారం చేసినందుకూ, కార్మికుల విప్లవోద్యమానికి మద్దత్తు తెలిపినందుకూ ప్రష్యా, ఫ్రాన్స్, బెల్జియం, జర్మన్ దేశాలకు ఆయన పోయాడు. శత్రువై ఇవాళ్ళ విప్లవకారులను బహిష్కరించడం లేక పోవచ్చుగానీ అంతకంటె తీవ్రమయిన నిర్బంధాలకూ, "ఎదురుకాల్పుల"

హత్యలకూ గురిచేస్తున్నాయి ఈనాటి ప్రభుత్వాలు. ఈ ఉదాహరణ లన్నింటిని బట్టి పెట్టుబడిదారీ "ప్రజాస్వామ్య"నికి మొదటినుంచి ఉన్న వర్గస్వభావాన్ని అర్థం చేసుకోవచ్చు.

లండన్‌కు పోయిన తరువాత అక్కడ మార్క్సు కుటుంబం అనుభవించిన దారిద్ర్యంగురించి చెప్పుకోవడం దుర్భరంగా ఉంటుంది. మార్క్సుకు నికరమైన ఆదాయమంటూ ఉండేది కాదు. డబ్బు సంపాదన గురించికూడ ఆయనెప్పుడూ ఆలోచించలేదు. ఒకసారి 1848లో పిత్రార్జితమైన సొమ్ము కొంత ఆయనకు వచ్చింది. యూరప్‌లో తిరుగుబాటు చేస్తున్న కార్మికులు ఆయుధాలు కొనుక్కోవడానికి ఆ సొమ్మును ఖర్చుపెట్టాడు. పేదరికంతో బాధపడుతూ కూడ తనదగ్గర డబ్బు ఉన్నపుడు ఇతరులను ఆదుకోవడానికి ఆయనెప్పుడూ వెనుకాడలేదు. లండన్ వెళ్ళడానికి చాల కాలం ముందునుంచే ఆయన పేదరికాన్ని అనుభవిస్తూ వచ్చాడు. బ్రస్సెల్స్‌లో ఉండగా మామగారిఇంటినుండి హెలెన్‌డెముూత్ అనేఆవిడవచ్చి మార్క్సు కుటుంబంలో చేరింది. ఆమె జీవితాంతంవరకూ ఆ కుటుంబంలో ఒకవ్యక్తిగాఉండి కష్టాలను పంచుకున్నది. అంతంతమాత్రంగానే ఆదాయంఉన్న ఆ కుటుంబాన్ని తన నేర్పరితనంతో ఆమె చక్కదిద్దుకుంటూ వచ్చింది. ఆమెమాటను కుటుంబంలో అందరూ వినేవారు. గొణుక్కుంటూనైనాసరే ఆమెమాట మార్క్సుకూడ వినవల్సిందే.

ఎంతటి పేదరికమూ, కష్టాలూకూడ మ్యార్క్సును కుంగదీయకపోవడమే ఆయన విషయంలో ఆశ్చర్యకరమైన విశిష్టత. ఒక్కొక్కప్పుడు ఆ మహామేధావికి చదవడానికి పత్రికా, రాయడానికి కాగితమూ, ఉత్తరంవేయడానికి స్టాంపులూ ఉండకపోయేవి. డబ్బుకోసం తన బూట్లనూ, కోటునూ కుదువబెట్టిన సందర్భాలున్నాయి. ఇటువంటి పరిస్థితుల్లో బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీకి వెళ్ళి తన రచనలకు అవసరమైన సమాచారాన్నికూడా సేకరించుకోలేక పోయేవాడు. అప్పుడప్పుడు "పెట్టుబడి (The Capital)" లెక్కలకు బదులు బాకీల లెక్కలతో సతమతం కావలసివచ్చేది. తీవ్రమైన అనారోగ్యంతో బాధపడినప్పుడుకూడ డాక్టర్ దగ్గరకు పోవడానికిగానీ, మందులు తేవడానికిగానీ డబ్బు లేకపోయేది. రోజులతరబడి ఉడకబెట్టిన బంగాళా దుంపలు మాత్రమే తినవలసివచ్చేది. పిల్లలకు బట్టలు కుట్టించలేకపోయేవాడు, బడి ఫీజులకు డబ్బు ఇవ్వలేకపోయేవాడు. 1852లో చిన్నకూతురు చనిపోయినపుడు అంత్యక్రియలకుకూడ డబ్బు లేకుండాపోయింది. చికిత్స చేయించలేకపోవడంవల్లనే 1855లో కొడుకు చనిపోయాడు. ఆదంపతులకు కలిగిన ఏడుగురు పిల్లలలో చివరకు

ముగ్గురే మిగిలారు. మార్క్స్ భార్య జెన్నీకి లివర్ కాన్సర్ వచ్చినపుడుగాని, తనకు ఊపిరితిత్తుల్లో సెగగడ్డ పుట్టినపుడుగాని ఇదే పరిస్థితి.

ఈ దుర్భరమైన దారిద్ర్యంనుంచి మార్క్స్‌నూ, ఆయన కుటుంబాన్నీ రక్షించినవాడు ఎంగెల్స్. ఎంగెల్స్ సహాయమే లేకపోతే మార్క్స్ "పెట్టుబడి"ని రాయలేకపోవడమేకాక, ఆకలితో తప్పకుండా మరణించేవాడు. ఎంగెల్స్ తండ్రికి ఒక బట్టలమిల్లు ఉండేది. ఎంగెల్స్ అందులో మేనేజర్‌గా పనిచేసేవాడు. ఆ ఉద్యోగం తనకుఇష్టంలేకపోయినా ఆదాయంకోసం ఓపికగా భరించేవాడు. ఈ రెండు దశాబ్దాల కాలమంతా ఎప్పటికప్పుడు తనకు వీలయినంత డబ్బును మార్క్స్‌కు పంపుతుండేవాడు. ఈ తప్పనిసరి ఎడబాటు ఆ మిత్రులిద్దరికీ దుర్భరంగా ఉండేది. ఆ మిత్రులు రోజుకొకటీ, ఒక్కొక్కసారి రెండేసి ఉత్తరాలు రాసుకునేవారు. మార్క్స్ ఆ ఉత్తరాల్లో తన రచనలకు సంబంధించిన విషయాలను ఎంగెల్స్‌తో చర్చించేవాడు. యూరప్ కార్మికోద్యమాన్ని ముందుకెలా తీసుకుపోవాలో మాట్లాడుకునేవారు. డబ్బు పంపమని రాసే ఉత్తరాలుకూడ అందులో కొన్నిఉండేవి. ఒక్కొక్కప్పుడు డబ్బు విషయం ఉత్తరాల్లో మార్క్స్ రాయలేక పోయేవాడు. "ప్రియమైన ఫ్రెండ్! పైకంకోసం ఈ ఉత్తరం నీకురాసేకన్నా నా వేళ్ళను నరుక్కుంటే బాగుండు ననిపిస్తున్నది. కానీ రాయక తప్పటంలేదు." అని ఒక ఉత్తరంలో మార్క్స్ తన ఆవేదనను వెళ్ళబోసుకున్నాడు.

పేదరికంలో కొంతఆసరాగా ఉంటుందని "న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్"కు విలేఖరిగా ఉండి వ్యాసాలు రాస్తుండేవాడు మార్క్స్. అప్పట్లో ఆ పత్రికకు వారానికి రెండు వ్యాసాలురాయగా వచ్చే ఒక పౌను మాత్రమే ఆయనకు నికరమైన ఆదాయంగా ఉండేది. నిజానికి ఇందులో ఎంగెల్స్ సహాయం ఎంతగానో ఉంది. మార్క్స్ జర్మన్ భాషలో రాసిన వ్యాసాలను ఇంగ్లీషులోకి అనువాదంచేసి ఆ పత్రికకు పంపేవాడు ఎంగెల్స్. తాను స్వయంగా వ్యాసాలు రాసికూడా మార్క్స్ పేరిట ఆ పత్రికకు పంపేవాడు.

తాను ఎంచుకున్న జీవితమార్గంవల్ల మార్క్స్ అనుభవించిన కష్టాలూ, కన్నీళ్లూ అంతులేనివి. బాధామయమైన ఈ నిరుపేదజీవితాన్ని పంచుకోవడానికి ఆయన భార్య జెన్నీవాన్‌వెస్ట్‌ఫాలెన్ ఎంతమాత్రమూ వెనుదీయలేదు. ఆమె ట్రయర్ పట్టణంలోనే ఒక సంపన్న కుటుంబంలో జన్మించింది. మార్క్స్ జెన్నీలు బాల్య స్నేహితులు. మార్క్స్ కోసం జెన్నీ ఆర్థికంగా మెరుగైన ఎన్నో సంబంధాలను

నిరాకరించింది. ట్రయర్‌లోని అమ్మాయి అందరికంటె అందమైనదనే పేరునుకూడ ఆమెపొందింది. వీళ్లిద్దరికి 1836లో వివాహంనిశ్చయమైంది. కానీ వివాహంమాత్రం 1843లో జరిగింది. ఈ మధ్యకాలంలో మార్క్స్ బెర్లిన్‌లో విద్యార్థిగాఉంటూ ఎంతో ప్రేమకవిత్వాన్నీ, ఎన్నో ప్రేమలేఖలనూ ఆమెమీద కుమ్మరించాడు. పెళ్లయిన కొద్దికాలానికే మార్క్స్ జీవితాన్ని పేదరికం కాటువేసింది. పేదరికంలో జెన్నీ మార్క్స్‌కు ఎంతో ఓదార్పుగా ఉండేది. ఒకరిమీద ఒకరికి అమితమైన ప్రేమ. పేదరికాన్ని భరించలేక చావడమే నయమనుకున్న క్షణంలోకూడా మార్క్స్‌ను వివాహం చేసుకున్నందుకు జెన్నీ విచారించలేదు. మార్క్స్‌తోపాటు జెన్నీ పేదరికాన్ని మాత్రమేకాకుండా నిర్బంధాన్నికూడా అనుభవించింది. ఉద్యమసంబంధమైన పనుల మీద మార్క్స్ ఇంటికివచ్చిన వారందరికీ తన సుహృద్భావంతో ఆమె ఆహ్లాదాన్ని కలిగించేది. ఆమె స్నేహపూర్వకమైన ఆదరణగురించి ఎంతోమంది తమ జ్ఞాపకాలను చెప్పుకున్నారు. మార్క్స్ రచనా వ్యాసంగంలో ఆమెపూర్తిగా సహకరించింది. నిద్రనూ, ఆరోగ్యాన్నీ లెక్కపెట్టకుండా మార్క్స్ రాత్రింబగళ్లు అవిరామంగా పని చేయడ మొక్కటే ఆమెకు బాధాకరంగా ఉండేది. ఆయన చేసిన రచనలను చదివి తన అభిప్రాయాలను చెప్పేది. ఆ విధంగా ఆమె మార్క్స్ రచనలకు తొలి పాఠకురాలుగా, తొలివిమర్శకురాలుగా ఉండేది. అప్పుడప్పుడు పార్టీకి సంబంధించిన పనులనుకూడ ఆమెచేసేది.

ఫ్రెంచ్ రిపబ్లిక్ అధ్యక్షుడైన లూయీ బోనపార్ట్ 1851లో ఒక రాజకీయ కుట్ర చేసాడు. శాసనసభను రద్దుచేసి తన్నుతాను శాశ్వత అధ్యక్షుడుగా ప్రకటించుకున్నాడు. ఈ సందర్భంగా ఫ్రెంచ్ సామాజిక పరిస్థితులను పరిశీలనచేస్తూ మార్క్స్ ఒక గ్రంథాన్నిరాశాడు. దానిపేరు "The Eighteenth Brumaire of Louis Bonaparte" ఇది 1851లో రాయబడింది. ఫ్రాన్స్ రైతాంగ పరిస్థితులను విశదీకరిస్తూ, కార్మికవర్గ నాయకత్వంలో జరిగే విప్లవపోరాటంలో కార్మికవర్గంతోపాటుగా రైతాంగంకూడా కలిసివస్తుందని మార్క్స్ ఈ రచనలో చెప్పాడు. విప్లవకాలంలోనే సామాజికాభివృద్ధి వేగంగాజరుగుతుంది. పెట్టుబడిదారీ విప్లవానికీ కార్మికవర్గ విప్లవానికీ తేడాఉంటుంది. పెట్టుబడిదారీవిప్లవం వర్గసమాజపు పరిధిలోనే వస్తుంది. అంటే ఈ విప్లవంవల్ల ఒకవర్గంస్థానంలో మరోవర్గం అధికారంలోకి వస్తుంది. అందువల్ల ఈ విప్లవానికి కొంతకాలంపాటే అభ్యుదయలక్షణం ఉంటుంది. కార్మికవర్గ విప్లవం సమాజంలోని వర్గాలను తుడిచిపెడుతూవస్తుంది. అందువల్ల ఈ విప్ల

వానికి సుదీర్ఘకాలం పడుతుంది. ఈ విప్లవం తన సుదీర్ఘకాలంలో మౌలికమైన సామాజికమార్పును తెస్తుంది. కార్మికవర్గవిప్లవం విజయవంతమైన తరువాత పాత రాజ్యాంగయంత్రాన్ని ధ్వంసంచేసి కొత్తగా తనకవసరమైన రాజ్యాంగయంత్రాన్ని రూపొందించుకోవాలి.

19వ శతాబ్దిమధ్యలో యూరప్‌ఖండాన్ని ఊదిపివేసిన విప్లవవెల్లువకు అడ్డుకట్ట వేయడానికి ప్రష్యన్‌ప్రభుత్వం కొంతమంది విప్లవకారులమీద కుట్రకేసుపెట్టింది. "కమ్యూనిస్ట్ లీగ్"కు చెందిన పదకొండుమంది సభ్యులమీద 1852లో పెట్టిన ఈ కేసు "కొలోన్‌కుట్రకేసు"గా ప్రసిద్ధిచెందింది. ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్ర చేసారని వీళ్లమీద ప్రభుత్వం అభియోగం చేసింది. విప్లవ కార్మికసంస్థలను తుడిచి పెట్టాలన్నది ఈ కేసువెనుక ప్రభుత్వానికున్న ఉద్దేశం. తన అభియోగాన్ని నిరూపించడంకొరకు ప్రష్యన్ ప్రభుత్వం ఒక దొంగమినిట్స్ పుస్తకాన్ని తయారు చేసింది. దొంగసాక్ష్యాలను సేకరించి పెట్టింది. ఈ కేసులో విప్లవకారులను అరెస్టు చేసినప్పటినుండివాళ్ళను కాపాడడానికి మార్క్స్ ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకున్నాడు. నిజమైన మినిట్స్ పుస్తకాన్ని సంపాదించడానికి ఆయన ప్రయత్నించాడు. ప్రభుత్వం చూపుతున్న సాక్ష్యాలను దొంగసాక్ష్యాలని నిరూపించడానికి అవసరమైన ఆధారాల కొరకు ప్రయత్నించాడు. ఈ ప్రయత్నాలకొరకు ఎంతోమందికి ఉత్తరాలు రాయ వలసి వచ్చేది. ఆ ఉత్తరాలు గమ్యంచేరుతుంటాయనే ఆశలేదు. అందువల్ల ఏదో ఒకటి చేరాలనేఆశతో, ఒక్కొక్క ఉత్తరానికి పదేసికాపీలుచేసి, వాటిని వివిధ మార్గాల్లో పంపేవాడు. ఈ విషయంలో ఎంగెల్స్ బాగాసహాయంచేసాడు. వ్యాపార వర్గంలో తనకున్న పలుకుబడినీ, వ్యాపార చిరునామాలనూ వాడుకుని ఆ ఉత్తరాలను గమ్యంచేరవేస్తుందేవాడు. ఇంత ప్రయత్నంచేసినా చివరకు ఏడుగురికి శిక్షపడింది. దానితో 1852లో "కమ్యూనిస్ట్ లీగ్" ఛిన్నాభిన్నమయిపోయింది.

పెట్టుబడిదారీ ప్రభుత్వాలు విప్లవకారులను అణచివేయడం కొరకుపెట్టిన కేసుల్లో "కొలోన్ కుట్రకేసు" బహుశా మొదటిదయిఉంటుంది. అప్పటినుండి ఈ నాటివరకూ కేసులుపెట్టడం కొరకు ప్రభుత్వాలుచేస్తున్న కుట్రలు దాదాపు ఒకే విధంగా ఉంటున్నాయి. మనదేశంలో బ్రిటిష్ వలసపాలకులు భగత్‌సింగ్ వంటి విప్లవకారుల మీద "లాహోర్, మీరట్, కాన్పూర్ కుట్రకేసుల"ను పెట్టారు. ఈనాటి పాలకులు "పార్వతీపురం, సికిందరాబాద్ కుట్రకేసులు" పెట్టారు.

ఆర్థికశాస్త్రానికి సంబంధించి మార్క్స్ 1859లో మరోముఖ్యమైన రచన చేసాడు. రాజకీయార్థికశాస్త్ర విశ్లేషణ : ఒక కృషి (A Contribution to the Critique of Political Economy)" అని దాని పేరు. ఉత్పత్తి సంబంధాల గురించీ, మానవచైతన్యం గురించీ, ఆ రెండింటి మధ్యనున్న సంబంధాన్ని గురించీ మార్క్స్ ఇందులో సిద్ధాంతంచేసాడు. సామాజిక ఉత్పత్తిక్రమంలో మనుషులు తమ ఇష్టానిష్టాలతో ప్రమేయంలేకుండా నిర్దిష్టమైన సంబంధాలను ఏర్పరచుకుంటారు. వాటినే ఉత్పత్తి సంబంధాలు అంటారు. ఈ ఉత్పత్తి సంబంధాల మొత్తంమీదనే సమాజం యొక్క ఆర్థికనిర్మాణం జరుగుతుంది. ఈ ఆర్థికనిర్మాణం ఆధారంగా సాంఘిక,రాజకీయ, బౌద్ధికజీవితం ఏర్పడుతుంది. మనిషిచైతన్యం సమాజంలోఅతని ఉనికిని నిర్ణయించదు. సమాజంలో మనిషికున్న ఉనికే అతని చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. సామాజికగతిలో ఉత్పత్తిశక్తులు అభివృద్ధి చెందుతాయి. అప్పుడాశక్తులకు పాత ఉత్పత్తి సంబంధాలు సంకెళ్ళుగా మారుతాయి. ఈ దశలో ఉత్పత్తిశక్తులు ఉత్పత్తి సంబంధాలతో ఘర్షణకు తలపడుతాయి. ఆ ఘర్షణ ఒక సామాజిక విప్లవశకాన్ని ఆవిష్కరిస్తుంది.

ఈ పుస్తకానికి రెండవభాగం 1863లో వెలువడింది. ఈ రెండుపుస్తకాల్లో సరుకు, విలువ, అదనపువిలువ వంటి విషయాలమీద శాస్త్రీయమైన విశ్లేషణఉంది. మానవశ్రమచేత ఉత్పత్తిచేయబడి మార్కెట్లో అమ్మడానికీ, కొనడానికీ వీలయిన వస్తువు సరుకు. ఈ సరుకును ఉత్పత్తిచేసేది మానవశ్రమశక్తి. ఈ శ్రమశక్తిని పెట్టుబడిదారుడు ముడిసరుకుతోబాటు మార్కెట్‌లోకొంటాడు. శ్రమశక్తి ఆ ముడి సరుకుమీద పనిచేసి సరుకును ఉత్పత్తిచేస్తుంది. అదేసమయంలో విలువనుగూడ ఉత్పత్తిచేస్తుంది. ఆ విలువ శ్రమశక్తి విలువకంటె (అంటే కార్మికుడి కనీస అవసరాలు తీరడానికి అయ్యేఖర్చుకంటె) ఎక్కువ ఉంటుంది. ఇదే అదనపువిలువ. తనమనుగడకు అవసరమయ్యే విలువకంటే ఎక్కువ విలువను కార్మికుడు ఉత్పత్తి చేసి యజమానికి లాభంకల్పిస్తాడు. యజమాని కార్మికునిశ్రమను దోపిడీచేయడం ద్వారా అదనపువిలువను పొందుతాడు. నిజానికి దోపిడీవ్యవస్థలో మానవశ్రమఅంటే అదనపువిలువను సృష్టించే శ్రమే. అదనపువిలువ పెట్టుబడిగామారి, కార్మికునిశ్రమను దోచుకుని, యజమానికొరకు మళ్ళీ అదనపువిలువను సృష్టిస్తుంది.

మార్క్స్ జీవితమంతటిలోనూ, బహుశా మార్క్సిస్టు సైద్ధాంతిక సాహిత్యమంతటిలోనూ, అతిగొప్పరచన "పెట్టుబడి". "పెట్టుబడి"ని రచించడానికి నాలుగు

దశాబ్దాలకాలం పట్టింది. ఇంతదీర్ఘకాలంపాటుసాగిన ఈ రచనలో మార్క్స్ ఉత్సాహమూ, పట్టుదలా ఎప్పుడూ సన్నగిల్లలేదు. మానవజాతి చరిత్రిలోనే అసాధారణమైన ప్రతిభాపాటవాలు కలిగినవాడు మార్క్స్. ఆయనే "పెట్టుబడి"ని రాయడానికి నాలుగుదశాబ్దాలు కష్టపడ్డాడంటే ఆ గ్రంథం ఎంత విలువైనదో, ఎంత విశిష్టమైనదో మనం అంచనావేయవచ్చు. ఒకవైపు ఆయన యూరప్, అమెరికా ఖండాల్లోని కార్మికవర్గ ఉద్యమాలతో నిరంతరం సంబంధాన్ని పెట్టుకున్నాడు. ఆ ఉద్యమాలకు సంబంధించిన ప్రచారంలోనూ, వాదవివాదాల్లోనూ పాల్గొన్నాడు. కార్మికవర్గ విప్లవానికి అవసరమైన తాత్వికసంపదను సమకూర్చిపెట్టడానికి అవిరళంగా రచనలు చేసాడు. ఇన్నిపనులమధ్యకూడ ఆయన దీక్షతో "పెట్టుబడి"మీద పరిశ్రమించాడు. ఆయననూ, ఆయన కుటుంబాన్నీ పీడించిన దుర్భరదారిద్ర్యం ఆ దీక్షను ఎంత మాత్రమూ తగ్గించలేకపోయింది.

మార్క్స్, ఎంగెల్స్‌ల స్నేహం మొదలయిన కొంతకాలానికే ఇద్దరూకలిసి పెట్టుబడిదారీవిధానాన్ని అధ్యయనంచేయడానికి పూనుకున్నారు. "పెట్టుబడి" రచనలో మార్క్స్‌కు ఎంగెల్స్ సహకారం తుదివరకూ అలాగేకొనసాగింది. "పెట్టుబడి"ని రాసే సమయంలో తనకెదురైన ఎన్నోసమస్యలను పరిష్కరించుకోవడానికి మార్క్స్ ఎంగెల్స్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతుండేవాడు.

"పెట్టుబడి" రచన ఇంత దీర్ఘకాలం సాగడానికి మార్క్స్ అనుసరించిన పరిశీలనావిధానంకూడా ఒక కారణం. ఆయన ఎంత చిన్నవిషయాన్నైనా ఆధారం లేకుండా, వినికిడిమీద నిర్ధారణకు రాలేదు. ఖచ్చితమైన పరిశీలన, అధ్యయనం తరువాతనే ఏ విషయం మీదనైనా ఆయన రచనచేసాడు. ఆ పరిశీలనకూ, అధ్యయనానికీకూడ కనిపించిన రచయితనూ, చేతికందిన పుస్తకాన్నీ ప్రమాణంగా స్వీకరించలేదు. తాను పరిశీలిస్తున్న అంశంమీద తన కాలానికి అందుబాటులో ఉన్న అత్యంత ప్రామాణికమైన రచన ఆధారంగానే ఆయన అధ్యయనంసాగింది. ప్రతి విషయాన్నీ విపులమైన ఉదాహరణలతో, సాక్ష్యాధారాలతో చెప్పాడు. ఆయన భావాలమీద ఎంత వ్యతిరేకత ఉన్నవారైనా ఆయన నిర్ణయాలను వ్యతిరేకించవలసిందే తప్ప ఆ నిర్ణయాలకు మూలమైన వివరాలను తప్పుపట్టలేరు.

మార్క్స్ ఇతర రచనల్లో కూడ ఈ పద్ధతికనిపిస్తుంది. ఒకదశలో రష్యాలో కొనసాగుతున్న ఉద్యమాన్ని అధ్యయనం చేసినప్పుడు ఆ దేశంలోని వ్యావసాయిక

సంబంధాలను పరిశీలించాడు. ఈ పరిశీలనకు అవసరమైన సమాచారాన్ని నేరుగా సేకరించడానికి ఆయన 50 సంవత్సరాల వయసులో రష్యన్ భాష నేర్చుకోవడం మొదలుపెట్టాడు. రష్యన్ ప్రజల జీవితాన్నీ, సంస్కృతినీ తెలుసుకోవడానికి రష్యన్ సాహిత్యాన్ని చదివాడు. తనరచనలలో అంత ప్రామాణికత కొరకు ఆయన పాటు పడేవాడు. ఆయన రచనాశైలి విలక్షణంగాఉంటుంది. భావవ్యక్తీకరణలో స్పష్టతకూ, నిర్దుష్టతకూ ఆయన అత్యంత ప్రాముఖ్యాన్ని ఇచ్చాడు.

మార్క్స్ పరిశీలనకూ, అధ్యయనానికీ ఆయన లండన్ జీవితం బాగా పనికి వచ్చింది. ఆ కాలానికి ప్రపంచంలో బాగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీదేశాల్లో బ్రిటన్ మొదటిది. రవి అస్తమించని వలససామ్రాజ్యాన్ని స్థాపించి, ప్రపంచ మార్కెటు మీద సాటిలేని అధికారాన్ని చలాయిస్తున్న దేశంకూడా అదే. ప్రపంచ పెట్టుబడిదారీవ్యవస్థకు మణికిరీటంగా ఉన్న లండన్ నగరంలో బ్రిటిష్ మ్యూజియమ్ లైబ్రరీఉంది. ఆ లైబ్రరీలోని గ్రంథాల సాయంతో పెట్టుబడిదారీవ్యవస్థను తన కాలంనాటికి ఆసాంతమూ, కూలంకషంగా అధ్యయనం చేసాడు. ఆ అధ్యయనాన్ని ఉపయోగించి గతితార్కికచారిత్రిక భౌతికవాదదృక్పథంతో పెట్టుబడిదారీ సమాజాన్ని విశ్లేషించాడు.

"పెట్టుబడి" రచనలో పరిశీలనా పద్ధతికి సంబంధించిన క్లిష్టత మాత్రమే కాకుండా మానసికంగా, శారీరకంగా మార్క్స్ అంతులేని శ్రమచేసాడు. "పెట్టుబడి" మీద పనిచేసే బదులు కొంతపెట్టుబడి సంపాదించుమని తల్లి అన్న మాటలను పట్టించుకోకుండా రాత్రింబగళ్లూ పరిశ్రమించాడు. రాత్రి రెండు గంటల వరకు, మూడు గంటల వరకు, ఒక్కొక్కసారి తెల్లవార్లూ పనిచేసేవాడు. అవిశ్రాంతంగా సాగేపనిలో భోజనానికి మాత్రమే విరామం. "పెట్టుబడి" కొరకు తన ఆరోగ్యాన్నీ, ఆనందాన్నీ, కుటుంబాన్నీ త్యాగంచేసానని ఆయన చెప్పుకున్నాడు. ఇంతచేస్తే "పెట్టుబడి" ప్రచురణ మీదవచ్చిన రాయల్టీలు "పెట్టుబడి" రాసే సమయంలో ఆయన కాల్చిన పొగాకు ఖర్చులకు కూడా సరిపోలేదు. అయితే "పెట్టుబడి" కార్మికవర్గం శత్రువుమీద దాడి చేయడానికీ, శత్రువునుండి రక్షించుకోవడానికి ఒక ఆయుధం.

"పెట్టుబడి" మూడు సంపుటాలుగా వెలువడింది. మొదటిసంపుటి జర్మన్ భాషలో మార్క్స్ జీవితకాలంలోనే 1867లో వచ్చింది. ఆయన మరణం తరువాత

1885లో రెండవ సంపుటి, 1894లో మూడవ సంపుటి వచ్చాయి ఆయన తన జీవిత కాలంలోనే "పెట్టుబడి"ని పూర్తిచేయాలని ఎంతగానో కోరుకున్నాడు. అయినా చని పోయేనాటికి రెండవ, మూడవ సంపుటాలు అసంపూర్తిగానే ఉన్నాయి. వాటిని ఎంగెల్స్ పూర్తిచేసి ప్రచురించాడు. మొదటి సంపుటి మొదటిసారిగా రష్యన్ భాషలోకి 1872లో అనువాదం పొందింది. తరువాత వివిధ సంపుటాలు వివిధ భాషల్లోకి అనువదించబడ్డాయి.

"పెట్టుబడి" గ్రంథం సరుకు విశ్లేషణతో మొదలవుతుంది. పెట్టుబడిదారీ విధానానికి ప్రాథమికమైన ఆర్థిక ప్రాతిపదిక సరుకు వర్గసమాజంలో అనాదిగా శ్రమశక్తి దోచుకోబడుతున్నది. ప్రతిఫలం పొందని శ్రమశక్తి పెట్టుబడిదారీవ్యవస్థ నాటికి పొందిన రూపమే వేతనకూలి. బురదమీద, రక్తంమీద పాకుతూ ప్రపంచం లోకి పెట్టుబడి ప్రవేశించింది. తనకాళ్లమీద నిలబడేశక్తి దానికి వచ్చేసరికి శ్రామి కున్ని శ్రమసాధనాలనుంచి పూర్తిగా వేరుచేసింది. మంచిచెడ్డ భేదాలతో నిమిత్తం లేకుండా ఒక పెట్టుబడిదారు మరో పెట్టుబడిదారుతో పోటీపడడానికి శ్రమశక్తిని ఎంతవరకు వీలైతే అంతవరకు దోపిడీచేస్తాడు. శ్రమశక్తికి ప్రతిఫలమైన వేతనం డబ్బురూపంలో ఉంటుంది. ఈ రూపం చాలానేర్పుగా యజమానిదోపిడీని మరుగు పరుస్తుంది.

కార్మికులు బతకడంకొరకు తప్పనిసరిగా శ్రమశక్తిని ఒకసరుకుగా అమ్మకో వలసిన స్థితిలోఉంటారు. ఈ శ్రమశక్తికి విలువను ఉత్పత్తిచేసేశక్తి ఉంటుంది. ఒక నిర్దిష్టమైన కాలంలో శ్రమశక్తి ఉత్పత్తిచేసేవిలువ ఆ శ్రమశక్తిని శారీరకంగా మానసికంగా తిరిగిపొందడానికి అవసరమైన విలువకంటె చాలాఅధికంగా ఉంటుంది. అయితే కార్మికుడుతన కుటుంబంతో అతికష్టంగా బతకడానికి అవసరమైనంత మాత్రమే యజమానినుంచి వేతనాన్ని పొందుతున్నాడు. ఇక్కడ దోపిడీజరగడమే పెట్టుబడి ఏర్పడ్డానికిమూలం. శ్రమశక్తిని అమ్ముకునే విధానాన్ని అంటే వేతనకూలీ వ్యవస్థను రద్దుచేయడంద్వారానే ఈ దోపిడీ అంతమవుతుంది.

ఎంతోశ్రమతో రాసిన "పెట్టుబడి"ని యూరప్‌ఖండంలోని పెట్టుబడిదారీ మేధా వులు తమ ఉదాసీనవైఖరితో, కుట్రపూరితమైన మౌనంతో తోసివేయాలని చూసారు. ఎంగెల్స్ ఈ కుట్రను తొందరగానే పసిగట్టాడు. "పెట్టుబడి"కి ప్రచారంరావడానికి ఒక పద్ధతిప్రకారం దాన్ని పత్రికల్లో విమర్శించాలని ఆయన నిర్ణయించాడు. ఈ

నిర్ణయాన్ని మార్క్స్ ఆమోదించాడు. పెట్టుబడిదారీ దృక్పథంతో "పెట్టుబడి"ని విమర్శిస్తూ ఎంగెల్స్ క్రమంగా అనేకపత్రికల్లో వ్యాసాలు రాసాడు. దాంతో పెట్టుబడిదారీ మేధావులు తమనటనను కట్టిపెట్టి, పెట్టుబడి"ని పట్టించుకోవలసివచ్చింది. ఆ విధంగా "పెట్టుబడి" మొదట ప్రచారంలోకి వచ్చింది.

ఇంటర్నేషనల్ స్థాపన మార్క్స్ జీవితచరిత్రలో మరోప్రధానమైనభాగం. యూరప్, అమెరికా ఖండాల్లోని వివిధదేశాల్లో సాగుతున్న కార్మికోద్యమాలను మార్క్స్ శ్రద్ధగాగమనించేవాడు. ఆ ఉద్యమాల నాయకులతో సంబంధాలు పెట్టుకుని అవసరమైన సలహాలు ఇచ్చేవాడు. ఆ ఉద్యమాలను సంఘటితపరచి, వాటికి అంతర్జాతీయంగా ఒక బలమైనవేదికను తయారుచేయడానికి ఆయన ప్రయత్నించాడు. దానిఫలితంగా 1864లో లండన్‌లో "మొదటి అంతర్జాతీయ కార్మిక సమాఖ్య (First International Working Men's Association)" ఏర్పడింది. దీన్నే సంక్షిప్తంగా మొదటి ఇంటర్నేషనల్ అంటారు. ఇది స్థాపించబడినప్పుడు వాస్తవంగా ఇంటర్నేషనల్ మాత్రమే. 1889లో రెండవ ఇంటర్నేషనల్, 1919లో మూడవ ఇంటర్నేషనల్ స్థాపించబడ్డాయి. అందువల్ల దీన్ని మొదటి ఇంటర్నేషనల్ అంటున్నారు. మొదటి ఇంటర్నేషనల్‌కు మార్క్స్ నాయకత్వం వహించాడు. మొదటి ఇంటర్నేషనల్ లేకుండా మార్క్స్‌జీవితం వజ్రంలేని వజ్రపుటుంగరం వంటిదని ఎంగెల్స్‌అన్నాడు. ఆయన నాయకత్వంలో అది వివిధ కార్మికోద్యమాలను సంఘటిత పరచడంద్వారా తన లక్ష్యాలను సాధించింది. ఆ ఉద్యమాలతో, దాని నాయకులతో అది సంస్థాగతంగా సంబంధాలు పెట్టుకున్నది. ఒకదేశపు కార్మికోద్యమానికి మరోదేశపు కార్మికవర్గం మద్దతును సంపాదించింది. ఆయాదేశాల్లోని కార్మికవర్గం అమలుపరచవలసిన సోషలిస్టు కార్యక్రమాన్ని రూపొందించి మార్గదర్శిగా పనిచేసింది.

1871లో ఫ్రాన్స్, ప్రష్యాలమధ్య జరిగినయుద్ధంలో ఫ్రాన్స్‌ఓడిపోయి, ప్రభుత్వం పతనమైపోయింది. ఆకారణంగా ఫ్రాన్స్‌లో తీవ్రమైన వర్గవైరుధ్యాలు తలెత్తి సంక్షోభపరిస్థితి ఏర్పడింది. ఈ సంక్షోభాన్ని ఉపయోగించుకుని పారిస్ కార్మికులు తిరుగుబాటుచేసారు. ప్రభుత్వదళాలతో వీరోచితంగా పోరాడి, రాజ్యాధి

కారాన్ని హస్తగతంచేసుకుని, కమ్యూన్‌ను నిర్మించారు. దీన్నే పారిస్‌కమ్యూన్ అంటారు. పారిస్‌కమ్యూన్ విజయం సోషలిస్టువిప్లవంయొక్క అనివార్యతను తెలియజేసింది. పెట్టుబడిదారీవిధానం తన అభ్యుదయస్వభావాన్ని కోల్పోయిందనే విషయాన్ని కూడా అది స్పష్టంచేసింది.

పారిస్ కార్మికుల తిరుగుబాటుమీద మొదటి ఇంటర్నేషనల్ ప్రభావంఉంది. విప్లవ పోరాటం జరుపుతున్న కార్మికులతో మార్క్స్ నేరుగా సంబంధాలు ఏర్పరచుకున్నాడు.

పారిస్ కమ్యూన్ పతనమైపోయిన తరువాత ఆ విప్లవం మొత్తాన్ని పరిశీలించి "ఫ్రాన్స్‌లో అంతర్యుద్ధం (The Civil War in France)" అని మార్క్స్ ఒక రచనచేసాడు. కమ్యూన్ పతనంనుంచి ఆయన ఇందులో రెండుగుణపాఠాలుతీసాడు. అందులో మొదటిది కార్మికులు బూర్జువా రాజ్యాంగయంత్రాన్ని ధ్వంసంచేసి కార్మిక నియంతృత్వాన్ని నిర్మించకపోవటం తీవ్రమయినలోపం. విప్లవపార్టీ లేకపోవడం వల్ల కమ్యూన్ పతనమయిందనేది రెండవగుణపాఠం. కార్మికవర్గం నెరవేర్చవలసిన కర్తవ్యాలను నిర్ణయించి, నాయకత్వాన్ని అందించగల పార్టీఅవసరం.

పారిస్‌కమ్యూన్ పతనమైపోయిన తరువాత జరిగిన దమనకాండలో 30 వేల మంది కార్మికులను ఊచకోతకోసారు. 60 వేలమంది కార్మికులు వలసపోయారు. వలసపోయిన కార్మికులకు రక్షణఇవ్వడానికి, ఆశ్రియం కల్పించడానికి మార్క్స్ చాలాప్రయత్నించాడు.

క్రమంగా యూరప్‌ఖండంలో తీవ్రమైన నిర్బంధం వ్యాపించింది. ఆ నిర్బంధపరిస్థితుల్లో మొదటి ఇంటర్నేషనల్ పనిచేయడం రోజురోజుకూ కష్టమయింది. పారిస్ కమ్యూన్‌తరువాత మారినపరిస్థితులకు తగినవిధంగా ఇంటర్నేషనల్ నిర్మాణ రూపంలోకూడా మార్పు అవసరమయింది. మరోవైపు ఇంటర్నేషనల్ నీడలోనే కొంతమంది ప్రోద్బలంతో సంస్కరణవాదం తలెత్తింది. అటువంటి పరిస్థితుల్లో మొదటి ఇంటర్నేషనల్ ఉన్నందువల్ల ప్రయోజనంలేదని, దాని కార్యకలాపాలను కట్టిపెట్టాలని 1873లో మార్క్స్ నిర్ణయించాడు. ఫలితంగా మొదటి ఇంటర్నేషనల్ మరుగునపడింది.

మార్క్స్ ప్రధాన రచనావ్యాసంగం గురించిమాత్రమే ఇంతవరకు ప్రస్తావించబడింది. ఆయన మరెన్నోరచనలు చేసాడు. "అదనపువిలువ లక్షణాలు (Theories of Surplus Value) గోథా కార్యక్రమ పరిశీలన (Critique of the Gotha Programme)" అన్న రచనలు అందులో ఉన్నాయి. "ఆంటీ డూరింగ్ (Anti - Duhring)" రచనలో ఆయన ఎంగెల్స్‌కు సహకరించాడు. ఆయన రాసిన వ్యాసాలుకూడా అపరిమితంగాఉన్నాయి.

ఆయనకృషికూడ రాజకీయార్థిక తాత్వికరంగాలకు మాత్రమే పరిమితంకాలేదు. విజ్ఞానికి ఆయన అన్వేషణాచింతన ప్రసరించని మానవకార్యకలాపరంగం లేదనిచెప్పవచ్చు. సాహిత్య కళారంగాల్లోకూడా ఆయన మార్గనిర్దేశం చేసాడు. బాల్జాక్‌వంటి రచయితల సాహిత్యాన్ని అనుశీలనచేయడంద్వారా సాహిత్యసృజనకూ, సాహిత్య విమర్శకూ శాస్త్రీయమార్గాన్ని చూపాడు. ఆయనకు యూరపియన్ సాహిత్యంతోబాగా పరిచయం. అన్ని యూరపియన్ భాషలనూ ఆయన చదువగలడు. ఫ్రెంచ్, జర్మన్, ఇంగ్లీషుభాషల్లో రాయగలడు. షేక్స్‌పియర్, గొథే కవులంటే ఆయనకు అభిమానం. షేక్స్‌పియర్ సాహిత్యాన్ని కూలంకషంగా చదివాడు. ఆయన నాటకాల్లోని ప్రతి చిన్నపాత్రకూడా మార్క్స్‌కు బాగాతెలుసు. లండన్‌లో ఉండగా షేక్స్‌పియర్ నాటకాలను మార్క్స్ చూసేవాడు. గణితశాస్త్రంమీదకూడ ఆయనకు ప్రత్యేకమైన అభిమానంఉంది. తన అలసటనూ, హృదయభారాన్నీ తగ్గించుకోవడానికి అప్పుడప్పుడు గణితశాస్త్రగ్రంథాలను ముందువేసుకుసేవాడు. పుస్తకాల్లో మునిగిపోవడమంటే ఆయనకిష్టం. "అవి నా బానిసలు. నా అభీష్టంప్రకారం నాకు సేవచెయ్యాలి" అని అనేవాడు. మార్క్స్‌కూ చేపలకూర, చదరంగంఅంటేకూడా ఇష్టమే.

మార్క్స్ తానెంతటిగొప్పవాడయినప్పటికీ ఇతరుల గొప్పతనాన్ని గుర్తించడంలో ఎప్పుడూ వెనుకాడలేదు. తన సమకాలికుడైన డార్విన్ గొప్పతనాన్ని మొట్టమొదట గుర్తించినవాళ్లలో మార్క్స్ ఒకడు. డార్విన్ పరిణామసిద్ధాంతాన్ని చదివి ఆయనను ప్రశంసిస్తూ ఎంగెల్స్‌కు ఉత్తరంరాసాడు. డార్విన్‌మీద గౌరవంతో ఆయనకు "పెట్టుబడి" ప్రతిని పంపాడు.

మార్క్స్‌కు పిల్లలంటే చాలాప్రేమ. రచనావ్యాసంగంలో తీరికలేకుండాఉన్న సమయంలోకూడా దగ్గరకువచ్చిన పిల్లలపట్ల ఆయన ఎప్పుడూ చిరాకును ప్రగ...

వాడుకాదు. వాళ్లనెప్పుడూ ఏ విషయంలోనూ ఆయన ఆజ్ఞాపించలేదు తనకునచ్చిన విషయాన్ని వాళ్ళతోమాట్లాడి ఆ విషయంపట్ల వాళ్లకూడా అయిష్టతచూపేలా చేసే వాడు. వాళ్ళకుకూడ మార్క్సఅంటే ఎంతోఅనురాగం వాళ్లూ, మార్క్సకు సన్నిహితులైన ఎంగెల్స్‌వంటివాళ్లూ మార్క్సను ప్రేమతో మూర్ అని పిలిచేవాళ్ల. మార్క్సకు మిగిలిన ముగ్గురుకూతుళ్లు జెన్నీ, లారా, ఎలియనార్‌లు ఆయన బాటలో పయనించి యూరప్ కార్మికోద్యమంలో పనిచేసారు.

మార్క్స తనజీవితంలోని చివరి సంవత్సరాల్లోకూడా దేశదేశాల్లోని సోషలిస్టు ఉద్యమాలతో సంబంధాన్ని కలిగి ఉంటూవచ్చాడు. అనేకదేశాల్లో కార్మికవర్గపార్టీలను స్థాపించడానికి ప్రయత్నించాడు. ప్రపంచచరిత్రనూ, ఆసక్తికరమైన ఇతర విషయాలను అధ్యయనం చేస్తూవచ్చాడు.

మార్క్స భార్య జెన్నీ అనారోగ్యంతో బాధపడి 1881 డిసంబర్‌లో చని పోయింది. ఇదిమార్క్సకి బలమైనదెబ్బ. ఆయన ఆరోగ్యంకూడా అంతంతమాత్రం గానేఉంది. జీవితాన్ని పట్టుకుని వేళ్ళాడ్డానికి ప్రయత్నిస్తున్న మార్క్సకు మరణశిక్ష లాగా పెద్దకూతురు జెన్నీ మరణం 1883 జనవరిలో సంభవించింది.

1883 మార్చి 14నాడు మార్క్స మరణించాడు. "కార్మికవర్గపోరాటపు నాయకుడు, కార్మికవర్గ విమోచనకు ఆయుధాలు తయారు చేసినవాడు మరణించినాడు. చీకటినుండి జనించి, చీకటిని సృష్టించే అజ్ఞానాన్ని చెదరగొట్టడానికీ, సమస్తమానవ జాతికీ ఒక నూతనయుగమూ, నూతనపరిస్థితులూకలిగే అవకాశాలను సృష్టించడానికీ ప్రపంచంలోకి, బూర్జువా ప్రపంచంలోకి, మెరుపులను విరజిమ్మిన బ్రహ్మాండమైన మేధావి మరణించినాడు." "సైబీరియాగనులనుండి కాలి ఫోర్నియాదాకా, యూరప్ అమెరికాలలోని సకలభాగాలలోనూ వున్న లక్షోపలక్షల విప్లవ సహకార్మికులచేత ప్రేమింపబడి, పూజింపబడి, వాళ్ళకు దుఃఖం కలిగిస్తూ మరణించినాడు."

మార్క్స భౌతికకాయం లండన్‌లోని హైగేట్‌శ్మశానంలో మార్చి 17నాడు సమాధి చేయబడింది. అక్కడే ఆయన ప్రియమైన భార్యజెన్నీ సమాధికూడాఉంది.

"ఆయన పేరు చిరస్థాయిగా నిలుస్తుంది, ఆయన కృషి కూడా అంతే!"

కవిత :

# గీత

ఎన్. తిర్మల్

నువ్వు ఉప్పూకారం తినాలేగాని
మనిషి వెందుక్కాదు
నీవొంట్లో
చీమూ నెత్తురూ పారాలేగాని
బతకడం ఎంతపని
నీలో
ఫాస్వరం ధర్మాలు వుండాలేగాని
అగ్గిపుల్లెందుకు మండదు
నీకత్తి ఆకురాయిమీద పొర్లాలేగాని
పదునెందుకు రాదు
ఇక నీజెండాను బహిరంగంగా
బజార్లలో బొలిపావు తప్పితే
ఎన్నడైనా
ఉప్పు తినిపించావా
నెత్తురులో తడవనిచ్చావా
ఫాస్వరంలా మండనిచ్చావా
యుద్ధగీతం బోధించావా
ఇంత
నీమూలుగుల్లో
జవం ఎట్లా వుంటుంది
జనాం కీత కాకుండా
నీజెండా ఎరుపెట్లా అవుతుంది?

పాటలు :

# పోరు కోరి

సూరీడు

నాపరాళ్ల కోరిలోన
ఓ....రాజన్న, రామన్న, విసన్న, రహిమన్న
ఎర్రజెండా లెత్తినడవాలన్నా ॥నా॥

పొద్దున్నే లేచి సద్దికూడుతిని
అద్దు చింపులుంగి అడ్డుగట్టుకోని
ఉలి సుత్తెలుఊటంగా భుజానెట్టుకోని
తెల్లబాటీ కోరికి తెల్లారబోయి
గుండెలన్ని మండంగ బండచీల్చుతుంటావు ॥నా॥

సట్టు కొట్టికొట్టి నీసత్తువంతఉడికె
గాడి కొట్టికొట్టి నీ గుండెలన్ని మరిగె
కీట్లు, కీట్లు లేపి వల్లుకాట్లుపడే
కీటులన్ని మవుగాడితె నోటులన్నివాడుదొబ్బె ॥నా॥

కరకర పొద్దుబొడిసె పెరపెర పేగులమంట
గుండెమంట బెట్టినా బండగొట్టుటాపవు
కత్తిలాంటి రాయి నీకాలుకందగోపినా
తిరగబడి సుత్తితో కసిగా దాసరుమతావ్
సెమటంతా పదునుబోపి శ్లాబ్ సక్కగాచేస్తావ్
బతుకుని బలిపెట్టి నువ్ బండలన్నిగొడుతుంటె
సుప్పనాతి సేటుగాల్లు సొమ్ము జేసుకుంటన్నరు ॥నా॥

రాయితోపాటు రాల్లల ఎండిసీవు
రాయి, రాయి. రాయికి రక్తాన్నిదారబోసి
భూమిలుండె రాల్లను భూమిపైకె తెస్తావు
నీడల్లకూసున్న నీసైన సేటులు
మూలలిరిగి పాయేనావి మప్పయడుగోసేసే ॥నా॥

పడ్డుకూలిమొన్న ఎద్దంత బిడ్డ ఇచ్చే
మోసేరాయి విరిగి గుదినరం తెగిపోయే
ఉలినలకలు శల్లను ఊచకోతగోసే
బర్మబెట్టుబోయి నీబతుకుఎల్లిపొయే
ఆబర్మలన్ని ఏకంగా దోపిడి గుండెలచీల్చు ॥నా॥

ఎందుకే అన్నా బ్రతుకెందుకిలాఉంది?
నోటికందనికూడు, గోచికందనిగుడ్డ
కన్నాలగుడిసే కారుచీకటిగౌంది
సుప్ పాలరాయిగొట్టి తాటాకుగుడిసెలుంచే
నీ పాలరాతితోనే వాడి బంగ్లమె పిపోయే
ఆమెరుపుల్లో ఎరుపై అదనుజూచిరుపోజేయ్ ॥నా॥

(నా కా స ఆధ్వర్యంలో జరిగిన సమ్మె విజయవంతమైన సందర్భంగా కండలు చీల్చుకుంటు నాగరిక యుగానికి నాపరాళ్ళు పరుస్తున్న నాపరాయి కార్మికులకు వినమ్రింగా అంకితం)

కోరి - క్వారీ

సట్టు - పనికిరాని ముడిబండ

గాడి - సట్టు కొట్టడానికీ, రాయి ఉత్పత్తిచేయడానికి వీలైన పరిస్థితి

కీటు - రాయిని ఉత్పత్తి చేయడానికి సిద్ధంగావున్నది అంటే సట్టు మట్టి అన్ని తీసి కార్మికుడు రాయిని ఉత్పత్తి చేసేందుకు అనువుగా చేసుకుంటాడు

## గురువింద గురుమల్లెలో

గోకా వెంకటేశ్వర్లు

గురువింద గురుమల్లెలో, గురువింద గురుమల్లెలో
ఎన్నాళ్ళు చేసేము పన్నెండు గంటలు ॥గు॥

రజ[1] నాడు రమ్మంటడే వాడు రజలేమో లేవంటడే
ఎన్నాళ్ళు సేసినా ఏమి ఫలమున్నాది ॥గు॥

ఛావు[2] ఇవ్వనంటడే వాడు బాంచోత్ పొమ్మంటడే
ఛావడిగితె వాడు అపురాజు[3] కోసేనే ॥గు॥

భీము[4] లు కట్టంటడే వాడు భీములువెయ్యంటడే
భీము కట్టకపోతె పనికాదుపొమ్మనే ॥గు॥

జోడోడు రాకుంటెనే వాడు డబలు చెయ్యమంటడే
చాతకాక నీవు డబలు చేయనంటే
తెరిలా రాకంటడే ॥గు॥

మిషన్లు తుడువంటడే వాడు పుట్టలుతీయంటడే
ఎన్నాళ్ళు ఎన్నేండ్లు ఈ వెట్టిచాకిరి ॥గు॥

మెడలెన్నో కడుతడే వాడు మిదెలెన్నోకడుతడే
తలదాచు కోనీకు గుడిసెనే కరువాయె ॥గు॥

బతుకంతా పనిచేసినా నీకు ఏహక్కులేదాయనే
నీరక్తమాంసాలు పిండుకోని వాడు కోట్లకు పడగలెత్తేనే ॥గు॥

కంటాక్టులూ పడుతడే వాడు కారిగర్ల[5] ను దోస్తడే
ఉచ్చబోయనీకు పురుసతులేకుంట నీరెక్కలుదోస్తడే ॥గు॥

యూనియసుందంటరే వాళ్లు లడేంగే[6] రమ్మంటరే
వెనుకనుంచి వాళ్లు జేబులు నింపుకొని నడుమజారుకుంటరే ॥గు॥

ఎన్నాళ్ళు ఎన్నేండ్లు ఇంక ఈ దోపిడీ ॥గు॥

నిన్ను దోసేటోల్ల నిలదీసేరోజొచ్చె ॥గు॥

గురువింద ...రుమల్లెలో గురువింద గురుమల్లెలో
కష్టజీవులంతా ఒక్కటైతీరాలే ॥గు॥

ఎర్రజెండ అండ నింత నీకున్నాది ॥గు॥

పోరాడితె నీకు పొయ్యేదేమిలేదు

పన్నెండు గంటల నిర్భంధపనితప్ప
దోపిడి నెదురించి పిడికిలి బిగియించుం ॥గు॥

(సూరత్ టెక్స్టైల్ మిల్లు కార్మికుల గూర్చి)

---

1 రజ - సెలవుదినము, 2 ఛావు - సెలవుకోసం అనుమతి 3 అపురజు - జీతము
4 భీము - యంత్రంలో వుపయోగించే ఒక పరికరం (చాల బరువు వుంటుంది)
5 కారిగార్లు - కార్మికులు 6 లడేంగే - పోరాటానికి

కథ :

# కొత్త ఎత్తు

కార్మిక

"శాంతక్కా ఎంకటయ్యబావ లేచిండా" కొమురయ్య పనుగడకున్న తడక గేటు తురుచుకొని లోని కొస్తు అడిగిండు.

అంపలికాడ కుండలు కడుగుతున్న శాంతమ్మ తలెత్తిచూసి 'రా అన్న రా కూచో.... బాయి బందున్నది కదా అని తీరిపారున్నడు.... ఇంకాలేవలేదు, అంటూ మసి చేతులమీద నీళ్ళు చల్లుకొని మొగన్నిలేపెందుకు గుడిసెలోకి పోయింది.

కొమురయ్య ఇంటి ముందు కుడిపక్కన జాటిసరిపోక వేసుకున్న డాంబర్ రేకుల షెడ్డుకాడికొచ్చి.... మంచం కోడుమీద కూచున్నాడు.... అప్పటికే ఆ మంచములో (కానిగిరి) పంతులుచెప్పిన హోమ్ వర్కు చేసుకుంటున్న ఎంకటయ్య పెద్దకొడుకు తొమ్మిదేల్లశీను నోటు పుస్తకములో ఏదోరాసుకుంటు చేతిలోని పెన్సిల్ ఎన్నిమలకలు తిరుగుతుందో అన్నివంకలు మూతి తిప్పుకుంటా రాసుకుంటాండు.... మరో పక్క ఎంకటయ్య తండ్రి అదేదో డాక్టర్లకే అంతుపట్టని వింతరోగంతో పాతగొంగడి నిండాకప్పుకొని తాళ్ళుతెగిపోయిన నులుకమంచముల పడి ఉన్నడు.... పాతిక సంవత్సరాలు CSP దుమ్ములో పనిచేసిన ఫలితంగా అతనికా వింతరోగం అంటుకున్నది.... పక్కింటివారు అంటేసిన బొగ్గుపొయ్యిలనుండి దట్టమైన బూడిద రంగు పొగ ఊపిరి సలుపనీయకుండా గాలికి ఇటువైపే వస్తున్నా దాన్ని వాళ్ళెవరు పట్టించుకోవటంలేదు.

'ఏం అల్లుడు బాగా చదువుకో.... లేకుంటే నీకు నా బిడ్డను ఇయ్య....' పండ్లన్ని బయటపడేట్టు నవ్వుకుంటా కొమురయ్య అన్నాడు.

రాసుకుంటున్న శీను ఏం బదులు పలుకలేదు కాని ఇంట్లోంచి బయిటికొచ్చిన ఎంకటయ్య 'ఆ నీబిడ్డనే చేసుకోవాలె.... మావోనికి 'కో' అంటే కోటిమంది వరుసకడ్తరు....' అన్ని అసలు మీ వంశంల పిల్లనే చెసుకోమోయి" అన్నాడు బూసుకండ్లు చికిలిస్తు.

"అవుమల్ల.... మా శాంతక్క ఏజన్మల ఏం పాపం చేసుకున్నదో గాని, లేకుంటే నిన్ను కట్టుకునే ఆడదెవతంటా" బదులిచ్చింది.

'చక్కదనాలసుక్క' ఎంకటి కొంటెగా పెండ్లాంకేసి చూసుకుంటున్నాడు.

శాంతమ్మ మూతి వంకర తిప్పి "చాల్లే సంబరం ఓదిక్కు అన్న వచ్చి నిలుచున్నడు.... ఇంక పరాసకాలు ఆడుకుంటాకూచో" అంటు శాంతమ్మ కడిగిన బోల్లను ఓదాని మీద ఒకటి పేర్చుకొని ఇంట్లకు తీస్కపోయింది.

"మీ అన్నకేమి పన్లేదు.... పొద్దుగాల్లేవంగనే ఊరిమీదపడ్డడు" అంటు మొఖం కడుక్కోను అంపలికాడికొచ్చిండు ఎంకటి.

కొమురయ్య 'అదిసరేగాని బావా, పోలీసులు పట్టుకపోయిన చంద్రియ్యను ఇడ్సిపెట్టిండ్లా?'

ఎంకటయ్య లేదన్నట్టుగా తలాడించి "పట్టుకపోయినోన్ని ఇడ్సిపెట్టకుంటె ఏం చేసుకుంటరు" అన్నడు.

ఇంట్లోంచి బయిటికొచ్చిన శాంతమ్మ.... బొగ్గుపొయి మంచిగాఅంటు కోవటం కోసం అటుఇటు కదిలించిదల్లా "పోలీసొల్లు నెరీ చెల్లించుకుంటాండ్లు.... నల్లకాడి రాజక్క కొడుకును మొన్నరాత్రి పట్టుకపోయి సావకొట్టాండ్లట....ఇయ్యాటి నాల్గు దినాలాయే.... పాపం అది ఒక్కటేఏడ్పు నోట్లెమంచిసీల్లు పోత్తలేదు.... ప్రాణం తీర్గ చిన్నప్పటినుండి చెటాన చెంపదెబ్బవేయకుండా పెంచుకున్నది.... వాళ్ళింట్ల మన్నుబడ గింత గింతపోరగాల్లను తీస్కపోయి సావగొడ్తాండ్లు.... ఇంటాంటే నాకే ప్రాణం తరక్కపోతందంటేనమ్మ" అంది ఎందుకో ఆమె ఆ మాటలంటుంటే బాధతో గొంతు జీరపోయింది.

"ఎందుకు పట్టకపోయిండ్లట?" కొమురయ్య.

"ఏమో మొన్న గా సారా దుకాణ్ల ఏదోలొల్లి జరిగిందట.... దాట్ల ఈ పోర దున్నడని ఇంటికాడ పండుకున్నోన్ని పండుకున్నట్టుగనె పట్టుకపోయిండ్లు" ఆమాట లంటూనే గిన్నెతో ఎసరు తెచ్చి పొయిమీద పెట్టింది.... ఎర్రిటిమంట గిన్నె అడుగు నుంచి పక్కలకు చాచుకుంటుపోయింది ఆవెల్గుగుల శాంతమ్మ ఎర్రి ముక్కుపుడక మరింతఎర్రిగా ప్రతిఫలించింది.

"రాత్రిపూట బజార్ల నడవాలంటే భయమైతందనుకో ఏ సందునుండి పోలీసోల్లువచ్చి పట్టకపోతరోనని ఒక్కటే భయం.... మొన్నటికి మొన్న మా బామ్మర్ది వూర్నుంచి వస్తాంటే.... రాత్రి పదకొండింటికి బస్సుస్టాండ్ల పోలీసోల్లు పట్టుకొని

టానలకు తీస్కపోయి.... నీసంచిలేమున్నయి తియ్యి బిడ్డా అని చెయిసంచి గుంజుకొని చూసిండ్లట.... గాసంచిల గొడ్డలున్నది.... ఇదెక్కడిదిరా అని రాత్రింత మత్రించిండ్లట.... నాకేమెరుక గిట్ల అయితదని.... పొయ్యిలకట్టెలు కొట్టుకొను కష్టమైతంది వూర్నుంచి వచ్చేటప్పుడు మాఇంటికాడ పాతగొడ్డలున్నది పటాయిమన్న వాడు పట్టుకొనస్తాంటే గిది జరిగింది.... తెల్లారిపొద్దుగాల్నె మాఇంటికి పోలీసులొచ్చిండ్లు సర్కిల్‌సాబ్ పిలుస్తాండ్లని.... నేను భయంభయంగా ఠానలకు పొయ్యేసరికి సంగతంతాతెల్సింది. ఆఖరికి కాళ్ళ వేళ్ళపడి జరిగిన సంగతంతాచెప్పి రెండు నూర్లు సదివించుకొని మావోన్ని ఇడిపించుకొని వచ్చేసరికి నా తలప్రాణం తోకకొచ్చింది" కొమురయ్య చేతులాడించుకుంటు చెప్పుకొచ్చిండు.

తువ్వాలతో మొఖం తుడుచుకుంటు ఎంకటివొచ్చి "మరి గా రాత్రి ఎందుకొచ్చిండు...." అన్నడు.

"సమ్మక్కల తీర్థానికి బస్సులన్నీ అటేనడిసెనయా.... కొద్దిదూరం లారీ మీదొచ్చి ఇగ ఆ తర్వాత నడిసివచ్చేసరికి గారాత్రిఅయింది."

ఎంకటి ఇంట్లోకినడిచి దండెంమీది లాగుఅంగి తెచ్చుకొని తొడుక్కుంటు "అసలింతకు బాయి నడుస్తదంటవా"

"నడిపినా నడవకున్నా బాయిమీదికిపోయి మస్టరేసుకొని వచ్చుడైతె తప్పదు కదా?" కొమురయ్య అన్నాడు.

ఎంకటేమి బదులుపలక్కుండానే చిలక్కొయ్యకున్న బెల్టుతీసుకొని నడుముకు చుట్టుకున్నడు.

ఇంతట్లో ఎంకటయ్య రెండోకొడుకు అప్పుడే నిద్రిసుండి లేచి సన్నగా ఏడ్వటం మొదలుపెట్టిండు.... శాంతమ్మ పొయ్యికాన్నుంచి లేచిపొల్లగాన్ని ఊరడించటానికిపోయింది.... అప్పటిదాక మంచంలో పడిఉన్న ముసలాయినె రెండు చేతులా కోడునుపట్టుకొని అయాసంగా లేస్తూ కస్సుకస్సున దగ్గుతు పక్కన ఉమ్మేసిండు.... అదితీగలాసాగి తెల్లటిగడ్డము మీదపడి అగిపోయింది.... ఎర్రి కోడిపెట్ట ఒక్కటి గబాగబా ఉరికివచ్చి కళ్ళనిముక్కుతో పొడవసాగింది.... మసకబారిన జీవములేని కళ్ళతో ముసలాయన ఎటో చూసుకుంటుకూసున్నడు.... అంతవరదాక రాసుకుంటున్న శీను పుస్తకాలునర్ది సంచిలోదోపి ఆడుకొను బయిటికి పోయిండు.

బట్టలు మార్చుకున్న ఎంకటి భార్యనుద్దేశించి 'తినటానికేమన్న పెడ్తావె.'

"బాయినడిసెదెంతో నడవనిదెంతో.... ఇంత పొద్దుగాల్నెఏంతింటవు" కొమురయ్య.

"కడుపుల సల్లబడ్తె నవాబుతోనైనా సవాల్ చేయవచ్చుట" అంటూ ఎంకటి శాంతమ్మ తెచ్చిఇచ్చిన తట్టి అందుకొన్నడు.

"అక్కడ పెద్ద నవాబున్నడు.... ఇగవానితోని సవాల్ చేస్తువుగాని" అంటు కారెడ్డమాడిండు.... కొమురయ్య.

ఎంకటి అట్లాగే మంచంమీదకూసొని గబగబా ముద్దలుకలిపి మింగసాగిండు.

అంతలోనే పక్కింటి రామలింగు కర్రి టక టక పొడుసుకుంటు వస్తున్నది ఏనుగుపొరకల పందుగుండాచూసిన కొమురయ్య "కాలుకెట్లున్నదే లింగన్న"

రాయలింగు మాటవచ్చిన దిక్కుచూసి.... "నొప్పింకా తగ్గలేదు తమ్మి.... ఇంకో పది పదిహేనురోజులుండాలంటాండ్లు డాక్టర్లు అంటూ గేటుకాడి తడక తెరుచుకొని లోనికొచ్చిండు.

"మరి ఉయిటెందుకు తిరుగుతానవు" ఎంకటి.

"ఊరిబయిటికి పోయివస్తాన.... ఇగఇంటికిపోతె మళ్ళీ తెల్లారెదాక మంచ ములసుండిలేస్తలేను" అంటు ఏనుగుపొంటివున్న తుమ్మమొద్దుమీద కూసుండి చేతి కర్రిను బుజానికి ఆనించుకొని దెబ్బతాకిన కాలును సాపుకొనికూసున్నడు.

"ఖొల్లగాండ అదృష్టంబాగుండి బ్రితికిబయట పడ్డవుగాని లేకుంటే ఒడిసి పోయెటోడివెనాయే" అంటూ నల్లటికాలుమీద మోకాలువరకు వేసిఉన్న తెల్లటిపట్టిని పరీక్షగాచూసిండు.... కొమురయ్య.

"మీ బాయెందుకు బందుంటాంది?" రాయలింగు

"జామ్‌ల గురించి" కొమురయ్య.

"దొరలంజకొడుకులు పొత్రిడక్షనో పొత్రిడక్షనంటరు.... లేబరోడు పొత్రిడక్షను తీయటానికి సౌలత్‌లమాట అటుండనియ్యి పనిచేసేందుకు సామాన్లయినా సరిగ్గ ఇయ్యరైరి.... బొగ్గుంటే లాడీసులుండయి.... సపోర్టుకోసం ఓతుంట దొరకదు" అసహనంగా గొణిగిండు రాయలింగు....

“ రెండుటబ్బులు నింపకుంటే కూలిగిట్టదు కదా అని మనం ఏదీలేకున్న పద్దుక పోయి వస్తేస్తం....” కొమురయ్య

“ అగో అదె అలసై పోయింది.... గీ దెబ్బేట్ల తాకిందనుకుంటానవు.... బామ్లు సరిగా లేకుంటే లాడీసు వయ్యేల మా జోడుగాడు ఎక్కడిదో చిన్నతుంటే పిండు.... అదిఆపక ఫుటుక్కుసఇర్గి బరబర వచ్చి నా కాలుమీద పల్టీఏసింది” రాయలింగు దెబ్బతాకిన సంగతి చెప్పుకొచ్చిండు.

అదివినేసరికి కొమురయ్యకు వెన్నుపొంటి భయంజొచ్చింది. సరిగ్గా మూడు వారాలకిందట అటువంటి ప్రమాదమేజర్గి అదృష్టంబాగుండి ఏదెబ్బతాకకుండా బయటపడ్డది యాదికొచ్చింది. “నీయవ్వ బాయివనంత బాంచెవని మరోటిలేదన్నా” అన్నడు.

అప్పుడికే ఎంకటి బయలుదేరటానికి సిద్ధమైవచ్చి కొమురయ్యపక్కననిల్చుని

మళ్ళోసారి ఎనక్కితిర్గి 'పోతాన'అని భార్యనుద్దేశించిచెప్పి రాయలింగుదగ్గర సెలవుతీసుకొని బయటకొచ్చిండ్లు.

ముందు ఎంకటి ఆ వెనుక కొమురయ్య గుడిసెలమధ్య ఇరుకుదారులగుండా నడిచి మూలమలుపుకాడికొచ్చేసరికి పందిపిల్లవొకటి వొళ్ళను రాసుకుంటఉరికింది దానివెనక తరుముకుంటువచ్చిన ఊరకుక్క ఒకటి వీళ్ళనుచూసి బెదిరి మరోసందులో మాయమయ్యింది. మరోగుడిసెముందు అత్తకోడల్లిద్దరు అదేపనిగా తిట్టుకుంటాండ్లు. ఎవడో కడుపులపేగులన్ని అగిలిపోంగ వయ్యర వయ్యర మొఖం కడుక్కుంటున్నడు. రాత్రి బదిలిచేసి తిర్గివస్తున్న కార్మికుడొకడు సైకిల్తోసుకుంటు ఎదురైండు.

గుడిసెలుదాటి పెద్ద మురికి కాలువకాడికొచ్చేసరికి ఎల్లయ్య వాళ్లకు ఎదురు పడ్డడు. 'వనికేనా ఎంకటన్నా' అనుకుంటా దగ్గరికొచ్చిండు.

అవునన్నట్టుగా ఎంకటి తలాడించి “నీసంగతేమైంది ఆ మధ్యన నిన్ను సర్వీసులనుండి తీసేసిండ్లనివిన్నా, నిజమేనా” అడిగిండు.

“నవంబర్ 23 నుండి తీసేసిండ్లు” నిర్లిప్తంగా జవాబిచ్చిండు.

కొమురయ్య ఆశ్చర్యపోతూ “ఎందుకు” అని అడిగిండు.

"ఎందుకేంటి కంపినోడు తీసెయ్యాలంటే ఓ కారణముండాలా దొరల ఇష్టారాజ్యం" ఎంకటి మధ్యలో కల్గజేసుకొని అన్నడు.

"నీవు ఎన్నిఅయినాచెప్పు ఎంకటన్నా.... అందరెట్లాపోతే మనం గట్లపోవుడె మంచిది. ఉరికి ఉరికి ముందుపడ్తె మూతిపండ్లు ఇర్గపడుడుతప్ప మరేమిలేదు. ఎనకసీరి ఎవడొచ్చి ఆదుకోడు.... అదెపాయె దొంగలీడర్లు పట్టించుకోకుంటె పట్టించుకోకపోయిరి. అందరి సమస్యగురించి ముందుండి మాట్లాడినందుకు నన్ను పన్లెనుండి పీకేసిండ్లా.... ఒక్కనాకొడుకన్నా గిట్లెందుకు చేసిండ్లని అడిగిండా ?" మనసులో కుతకుతమంటున్న కోపం ఎల్లగక్కిండు.

ఎకంటి ఒక్కక్షణం ఏంమాట్లాడలేదు. ఆతర్వాత 'నిజమేతమ్మి! అన్యాయమే మరి. అందరుకల్సి ఏదోఒకటి చేయాల్సిఉండె. ఏదైనా సమస్యఉంటె ముందు నిల బడెవాల్లను ఏరెయ్యాలని చూస్తుందికంపిని.' క్షణంసేపు ఎల్లయ్యకేసిచూసి 'కాని ఏం పట్టించుకుంటలేరన్నదిమాత్రిం నిజంకాదు. మొన్న మాబాయిమీద జర్గిందేంటి. సరిగ్గా నీలెక్కనే మా బాయిలపన్జేసే చంద్రియ్యను తీసేసిండ్లు.

"ఎట్లెట్లా" ఎల్లయ్య అడిగిండు.'

అప్పటికే వాళ్లు హాస్పటల్‌దాటి అండర్‌బ్రిడ్జి దారిలోకొచ్చిండ్లు. కొము రయ్య వాళ్ళ సంభాషణ మౌనంగావింటూ నడకసాగించిండు. ఎంకటి బాయిమీద జర్గినసంగతి చెప్పుకొచ్చిండు.

"లెక్కప్రికారము కంపిని లాడిసోల్లకు జామ్‌లు సప్లయి చెయాల్సిన బాధ్యతుందిగదా! అవిలేకుంటనే పనిఎల్లదాయే. దాంతోమనం అక్కడో ఇక్కడో జాములుఏరుకొచ్చి పనెల్లదీసుకుంటామాయే. మొన్న గట్లనే మాగ్యాంగుల పన్జేసే చంద్రియ్య మస్టరేసుకొని బాయిమీద జాములకోసము అటు ఇటు తిర్గుతాంటె అండర్ మేనేజర్‌చూసి.... ఏడున్నరఐతాంది ఇంకా బాయిలకెందుకు దిగలేదని కోపానికొచ్చిండట. దాంతో మావోడు జామ్‌లకోసం చూస్తున్న అనిచెప్పినా విని పించుకోకుండా ఏడున్నరఅయినా నీవింకా బాయిలదిగలేదు కాబట్టి నీకు ఈరోజు మస్టరులేదు ఇంటికిపొమ్మన్నడు."

"లాడీసోల్లకు జామ్‌లు సప్లయిచేయాల్సిన బాధ్యతమీది అట్లా సప్లయిచెయ్యక పోగా జామ్‌ల్ని మేమే అక్కడిక్కడఏరుకొని పనెల్లతీసుకుంటాంటె. మీదికెల్లి మామీదనే కోపానికొస్తున్నరు. ఇదెక్కడిన్యాయం" అని మావోడు ఎదురుతిరిగిండట.

"నామాటకే ఎదురుచెప్తావా నీకు ఇయ్యాల మస్టర్ ఎట్లావస్తదో చూస్తా" అంటూ గరంగా ఎల్లిపోయిండు అండర్ మేనేజర్ దొర.

మావోనికి ఎటుతోచక జామ్‌లు పట్టుకొని బాయిలదిగి మాదగ్గరికొచ్చి జర్గింది చెప్తె, మావోళ్ళుఅన్నరుకదా "ఏంచేస్తడో చేసుకోనియ్. నీవుమాత్రం తిర్గి పోయెందుకు వీల్లేదు. నీకేమన్నజర్గితె మేమందరమున్నం" అన్నాము.

"చూడుచూడుమని ఆరోజే లాడీసుల సప్లయిసరిగాలేక మేం బాయిమీదికొచ్చే వరికి అందరెల్లిపోయిండ్లు. ఇక మేమేఆఖరు. పైకెక్కెటాల్లకు ఏమున్నది దొర పోలీసులను పిలుచుకొచ్చి మమ్ముల్ని అటు ఇటు గెదిమి మా చంద్రయ్యను అరెస్టు చేసి పట్టుకపోయిండు.

'అరెస్టుచేసిన కార్మికున్ని విడిచిపెట్టాలి. దొరదౌర్జన్యం నశించాలని' మేము సెకండుషిప్టునుంచి బాయి బందుపెట్టిచ్చినం. అగో అట్ల బాయిబందయి ఇయ్యాల్టికి పద్నాల్గు రోజులైతాంది. అరెస్టుచేసినవాన్ని ఇంకా ఇడ్సిపెట్టలేదు. మేం బాయిలకు దిగిందిలేదు." ఎంకటి చెప్పటంఆపిండు. అప్పటికేవాళ్లు అండర్‌బ్రిడ్జికాడి కొచ్చిండ్లు. అక్కడ రోడ్డుమలుపు చీలేకాడ రాంబాయమ్మ చాయ్‌హోటలుంది. డ్యూటికిపోయే కార్మికులు.... వచ్చేకార్మికులతో అప్పటికే సందడిగా ఉంది.

"చాయ్ తాగిపోదాం పా" అంటూ కొమురయ్య ముందు దారితీసిండు.

ఎంకటి ఎల్లయ్య ఇంకా మాటలు కొనసాగిస్తూ హోటల్‌కాడికొచ్చిండ్లు.

ఎవరో వెడల్పుమొఖం కార్మికుడు టోపిసంకలపెట్టుకోని చాయ సప్పరించు కుంట "నిజంమాట్లాడినోడు రాడికలోడై పోయిండు. ఇక ఎవడు ఏంమాట్లాడకుంటా లేబరోల్ల నాలుకలు కొయ్యిండ్లి. అప్పుడు ఎవడేం మాట్లాడడు" అంటూ చెప్పుక పోతున్నడు కోపంగా.

రాత్రితాగిన సారామత్తు తలకుపట్టియ్యగా మరోచుక్క ఏసుకుంటేగాని తల దిమ్మదిగేట్టులేదని మొద్దుబాలయ్య తుపుక్కు తుపుక్కున ఊంచుకుంటూ హోటల్ కాడికొస్తుంటే సైకిల్‌మోటర్‌మీద రివ్వున ఎల్లిపోతున్న లీడరోడు డాష్ఇచ్చినంత పన్జేసి ఎల్లిపోయిండు. రోడ్డుకుఅడ్డంగానిలబడి "ఓరీ దొంగలంజకొడుకా మంది పెండ్లాల పియ్యితినుకుంటా బాగాబలిసి కండ్లుకనిపిస్త లేవురా" అంటూ కోపంగా అరిచిండు. ముందుకు దూసుకపోయిన లీడరోడు ఎనక్కితిర్గిచూసి పరిస్థితేమి బాగా లేదనుకొని ఎల్లిపోయిండు.

బాలయ్య ఎల్లిపోయినోని దిక్కు చూసి తుపుక్కున ఊంచి తిట్టుకుంటావచ్చి సీల్లగిలాస అందుకొని గడగడ నోట్లెపోసుకొని పుకిలించి ఊంచి మళ్ళీ సారాకొట్టు కేసి నడిచిండు.

చాయ్ సురుగులుకక్కుతుంటే మూడు గిలాసలల్ల చాయ్ తెచ్చిఇచ్చిండు బొమ్మదేండ్ల పిల్లవాడొక్కడు.

చాయ్ చప్పరిస్తూ కాలుమీద కాలేసుకొని సీరియస్‌గా ఏదో చెప్పుతున్న కార్మికుని మాటలు చెవులసోకినయి.... "మొన్న ఫిబ్రవరి 9న AITUC, INTUC, CITU మూడు యూనియన్లుకల్సి కొత్తచట్టానికి వ్యతిరేకంగా సమ్మెపిలుపిచ్చినయి మనంవాళ్ళ మాటమీద కెళ్ళి సమ్మె చేస్తిమి. ఆఖరుకు ఏమైందట". అడుగుతున్నడు పక్కనున్న తనితో అతనేమో బీడి అఖరిదమ్ములాగి బీడిపారేసి." ఎప్పటిదిప్పఎప్పటిలాగేఉంది. వీళ్ళు నిజంగా కార్మికులకు ఏదోమేలుచేస్తాయని చేసింట్లాఏమన్ననా. ఒకవేళ వీళ్ళకు నిజంగానే కోత చట్టఎత్తి వేయాలని ఉంటే 1981లో మనం కోత చట్టానికివ్యతిరేకంగా 56 రోజులు సమ్మె చేసినప్పుడు కోత చట్టముపోదు. అని సిగ్గు లజ్జలేకుండా చెప్పి సమ్మెను వ్యతిరేకించి ఆరోజు మేనేజుమెంటు బూట్లునాకినోల్లు మరి ఇయ్యాల కోత చట్టానికి వ్యతిరేకంగా సమ్మెకు పిలుపెందుకు ఇచ్చిండ్లంటవు?"

"అగ్గో గదేనాకు అర్థంకావటంలేదు" ఇందాకటి కార్మికుడు.

"ఏదోఒకటి చేయకుంటే లేబరోల్లల్ల పడిపోతున్న పలుకుబడిని నిలబెట్టుకునేది ఎట్లా అని కొత్తఎత్తు ఏసుంటరు" కొమురయ్య గిలాసు టేబుల్‌మీదపెట్టి ఆ సంభాషణలో జోక్యం చేసుకున్నడు.

"లేబరోల్లమీద అంతప్రేమఉంటే అక్రమంగా కంపెనీ డిసమిస్‌లు చేస్తాంటే ఎందుకో చప్పుడుచేస్తలేరు" ఎల్లయ్య

అంతవరదాక ఒక్కమాటయిన మాట్లాడకుంట అంతా వింటున్న పైయింట్ తొడిగిన యువకుడు మాట్లాడుతూ, ఇదివరదాక యూనియనోల్లకు లేబర్ల పలుకుబడి పోయినా, మేనేజుమెంటోడు దగ్గరికి పిల్సుకొని యూనియన్లోలు నాలుగుపైసలు సంపాయించుకోవటానికి ఆపని ఈపని పైరవి పనులుచేసేటోల్లు. ఈమధ్య కొత్తగా వచ్చిన M. D. సమ్మెలెందుకు జరుగుతానయో లెక్కలు తీసిచూసి, యూనియనోల్లను పిలిచి ఇగో మీప్రమేయం లేకుండా కార్మికులు ఈరీతిగా సమ్మెలు చేస్తుంటే కార్మికుల్లో మాకుఇంత పలుకుబడిఉంది అంత పలుకుబడి ఉందని చెప్పేమీరు ఏంచేస్తాండ్లు.

మీరు మాకు ఏంచేయనప్పుడు మీకు పనులెందుకు చేసిపెట్టాలి. ఇగమీదు నాదగ్గరికి రాకుండ్రి అని చీదరించుకున్నడట. దాంతో యూనియనోల్లు రెండికిచెడ్డ రేవడై పోయి ఏదోఒకటి చేయాలికదా అని కోత చట్టానికి వ్యతిరేకంగా సమ్మె పిలుపుఇచ్చి మేం ఏదో కోతచట్టంఆపినమని పోజులు కొడ్తాండ్లు. ఇంకా నాలుగురోజులుపోతే, ఎవరి ప్రమేయంలేకుండానే కోతచట్టానికి వ్యతిరేకంగా కార్మికులు మరోసమ్మె చేసె టోల్లు" అంటూ వివరంగా చెప్పుకొచ్చిండు.

"కడుపులలేంది కావలిచ్చుకుంటె వస్తదా. ఎన్నిరోజులు గిట్ల మోసము చేస్తరో అదీచూస్తం" అంటూ ఎంకటి కొమురయ్య. ఎల్లయ్య అక్కడినుండి బయటపడ్డరు.

రోడ్డుచీలేకాడ ఎల్లయ్య ఆగి 'ఇగనేనిట్లాపోతా' అన్నడు.

ఎంకటి ఒకక్షణంనిలబడి 'నిరుత్సాహపడకు డిస్మిస్‌వాల్లగురించి ఏదోఒకటి చేసేందుకు అందరముకల్సి ఆలోచిస్తాం. వీలుచూసుకొని సింగరేణి కార్మిక సమాఖ్య ఆఫీసుకాడికిరా'.

'సరె అలాగే' అంటూ విడిపోయిండ్లు.

అండర్ బ్రిడ్జినుండి 5 ఇంక్లయిన్ పోయేరోడెక్కి అప్పుడికే చాల పొద్దు పోయిందన్న తొందరలో వడివడిగా అడుగులేసుకుంటూ కదిలిండ్లు.

కొమురయ్యకు ప్రస్తుత పరిస్థితేమి అర్థంకావటంలేదు. అంతా కుడితిలపడ్డ ఎలకతీర్గ, వడ్లు పెర్గు కలిపినట్టుగా మింగుడుపడటములేదు. వున్న ఎకరముచెలక అమ్ముకొని బొగ్గుబాయిల పనికొచ్చినకాన్నుంచి నయాపైస మిగిల్చిందిలేదు. ఎప్పటి చిప్ప ఎప్పటిలాగే ఉందనిపించింది "ఎక్కడచూసిన కూలోనిబతుకు కుంపట్ల బొగ్గు తీర్గ కాలిపోవుడుతప్ప మరోదారి అగుపిస్త లేదు" అంటూ నిట్టూర్చిండు.

ఎంకటి నడుస్తున్నవాడల్లా ఒక్కసారి కొమురయ్య మొఖం కమ్ముకున్న విషాదఛాయలకేసిచూసి మళ్ళీ రోడ్డువైపు చూసుకుంటూ "నిజమే ఎనకట్నించి మన తాతముత్తాతల కాన్నుంచి గిదేబతుకు బతికిండ్లు. కాని ఇప్పుడిప్పుడే మన బతుకుల గురించి ఆలోచిస్తానము, పెనుగులాడుతాసం. మనమోమొక్కనాటినం. దానికి మన చెమట రక్తం దారబోస్తం. దాన్ని కంటికిరెప్పలా కాపాడి పెంచిపెద్దచేస్తం. మనమూ చెట్లఫలాలు తినకున్నా మన పిల్లలకైనా అవి దక్కేలాచూడాలి" అతనింకా ఏదో చెప్పుతామనుకున్నడు. కాని ఏంచెప్పాలో ఎట్లాచెప్పాలో తెలియక తిక మక పడ్డాడు.

ఏదో అర్థంచేసుకున్నవాడిలా కొమురయ్య తలాడించిండు.

దూరంగా రోడ్డునుండి బాయికి దారిచీలేకాడ గుంపుగా జనం కన్పించిండ్లు. ఒకరిమొఖాలు ఒకరు చూసుకున్నరు.

"మళ్ళేదో జర్గినట్టుందిబావా" కొమురయ్య

"ఏదైందీ అక్కడి దాకాపోయి తెల్సుకుందాం పద." ఎంకటి ముందడుగు వేసిండు.

మరి కొద్దిదూరం పోయేసరికి వాళ్ళకు స్పష్టంగా ముప్పయి నలభైమంది దాక పోలీసులు కన్పించిండ్లు. దాదాపుగా అరువై డెబ్బయిమంది కార్మికులు కన్పించిండ్లు.

కొమురయ్య ఎంకటి వాళ్ళను సమీపించేసరికి ఆపోలీసులల్ల ముగ్గురు S. I. లు ఒకసర్కిలు కనిపించిండు. గాండ్రుకప్పమొఖము S. I. ఒకడు వీళ్ళముందుకొచ్చి బొంగురుగొంతుకతో 'మీదేబాయిరా' అంటు లాటీఊపుకుంటూ అడిగిండు.

"5 ఇంక్లయిన్" ఎంకటి బదులిచ్చిండు.

"అరేయ్ 302 వీళ్ళను తీస్కపోయి అగో ఆలైన్లనిలబెట్టు" అంటూ ఎడమ చేయివైపు చూయించిండు.

సాయుధ పోలీసులు వాళ్ళిద్దర్ని తోసుకుంటుపోయి గుంపులోకి తోసిండ్లు.

అసలేమి జరుగుతుందో ఎవరికి అర్థం కావడంలేదు. పోలీసులు ఇలాఎందుకు అటకాయిస్తున్నారో కూడా చాలమందికి అర్థంకాలేదు. అందర్ని అరెస్టుచేస్తారా, కొడ్తారా? అనికొందరు, ఎక్కపోయి ఇరుక్కపోయామో, అనికొందరు చింతిస్తున్నారు.

మరికొంతమంది కార్మికులు దూరంనుండే ఇదంత పసిగట్టి పోలీసులకు ఓ ఫర్లాంగుదూరం ఆగి చూస్తుండిపోయిండ్లు.

కోలమొఖమున్న యువ కార్మికుడొకడు "మముల్ని ఎందుకాపిండ్లు?" అడిగిండు.

సర్కిల్ ఎద్దుతలకాయతిప్పి ఆ యువకున్ని మింగేసేలా చూసివాడి పైపుకదిలి 'నీవు వీళ్ళకు లీడరువారా' నాల్గు అడుగులేసి ఆగిపోయి. లాటీ పట్టుకున్నకుడిచెయ్యి ఎత్తి 'ఇటురా' అంటూ లాటీఊపిండు.

ఆ యువకార్మికుడు కదలకుండా చూస్తుండిపోయిండు. ఆ చూపులకు సర్కిల్ తట్టుకోలేక 'పిలుస్తుంటె రావేమిరా లంజకొడుకా' అంటూ కోపంగా అరుచుకుంటూ పోయి లాటీతో ఒక్కటివేసిండు.

ఎడమకంటి నొసలుచిట్లి చివ్వున రక్తంముఠికిగొట్టే బట్టలమీద చిమ్మింది.

ఈ హఠాత్తుపరిణామానికి కార్మికులు భయంతో కోపంతో ఊగిపోయిండ్లు. ఎవరు పారిపోకుండా చూడటంకోసము సాయుధ పోలీసులు అప్పటికే కార్మికుల చుట్టు వలయాకారంగా తుపాకులు ఎక్కుపెట్టి ఏక్షణంలోనైనా పేల్చటానికి సిద్ధంగా ట్రిగర్లమీద చేతులుంచుకొని పొజిషన్ల నిలుచున్నారు.

రొంబొచ్చె ఎండిపోయిన కార్మికుడు "నీ కాల్మొక్త బాంచెను నన్ను సంప కుండీ" సర్కిల్ కాళ్ళకు మొక్కబోయిండు. సర్కిల్ కాలుగుంజుకొని, జాడిచ్చి తన్నిండు.

కార్మికుల్లో మెల్లమెల్లగా కలకలం బయలుదేరింది. సర్కిల్ అదికనిపెట్టి రొంటికున్న పిస్టల్ తీసి 'ఖామూష్' అంటూ పెద్దగా అరిచిండు.

సూదిపడ్తేనే వినబడేనిశ్శబ్దం

కంకరరోడ్డుమీద సర్కిల్ బూట్లు టకటక లాడించుకుంటూ అటుఇటు తిరు క్కుంటా పట్టిపట్టి వంకరచూపులు చూసుకుంటా అరవటము మొదలుపెట్టిండు. "మంచిమాటకు నా అంత మంచోడులేడు. తిక్కరేగ్తె నా అంత చెడ్డోడులేడు. మిమ్ముల్నందర్నీ ఇక్కడ పిట్టల్లా కాల్చేసినా నన్ను అడిగేవాడుండడు. తెల్సిందా?

కార్మికులంతా బిరిపోయిండ్లు. ఇదంతా కలా నిజమా ఏంజరుగుతుంది. ఇదంతా ఏమిటి ఏమి అర్థంకావటంలేదు.

"మీకెందుకురా రాజకీయాలు. రాజకీయాలేమన్న బువ్వపెడ్తాయిరా. పాకు లెవురా మీకున్నంతజీతాలు! సుఖంగా పనిచేసుకొని బతకండిరా అంటే రాజకీయాలు అవసరమైనాయి? రాడికల్ లంజకొడుకులకేందిరా.... బందిపోటుదొంగలు వాళ్ళ మాటలిని మీరెందుకు చెడిపోతర్రా.... మిమ్మల్ని పట్టుకొనితంతె వాళ్ళువచ్చి విడి పించరేమిరా? మీరు ఆ లంజకొడుకుల మాటలే ఇంటర్రా. వాళ్ళమాటలిని మీరు పనులుమానుకుంటె మిమ్మల్నందర్ని బొక్కలోతోసి మక్కలిర్గతంతా.... ఎవన్నో అరెస్టుచేస్తె మీకేందిరా" ఆ బందిపోడు నక్సలైటు.... వాడిగురించి మీకెందుకురా. సర్కిల్ ఆయాసపడుతూ కాసేపుఆగిండు. మళ్ళీ అంతలోనే అందుకొని "ఆఖరి సారిగా చెపుతున్న మీరంతా ఇవ్వాల స్ట్రయిక్ బందుపెట్టుకొని పనుల్లకుపోకరా పొండి లేకుంటె మిమ్ముల్నందర్ని పిట్టల్లా కాల్చేస్తా".

కార్మికులు ఎటు కదలకుండా నిశ్చేష్టులైండ్లు.

"పదండి పదండి" అంటూ సబ్ ఇన్‌స్పెక్టరు కర్రతో గుంపుమీదపడి ముందుకు తోసిండు.

భయంతో కార్మికులు కదిలినా అందరిమనసుల్లో కోపం కుతకుతలాడింది.

వాళ్ళ గుండెలకు ఎక్కుపెట్టబడ్డతుపాకి గొట్టాలు ఏక్షణంలోనైనా పేలటానికి సిద్ధంగా ఉన్నాయి.

ముసలి రాజీరుకు తనముప్పయేండ్ల సర్వీసుల గిటువంటి పరిస్థితి ఎదురుకాలే. అయినా అతని మనసెందుకో మొద్దుబారిపోయింది. ఎంతోమందిని తన సర్వీసుల బొగ్గుపెల్లలకిందపడి నుగ్గునుగ్గయి పోంగచూసిండు. మరెంతోమంది కాల్లు ఏళ్ళు బాయికి బలియ్యంగా చూసిండు. అతని నల్లటి బోడిగుండుమీద ఊరినచెమట ఎండకు మెరిసింది. అతని పక్కన నిలుచున్న కోల్‌కట్టరు రాజిరెడ్డి కాయలుకాసిన పిడికిటిని బిగబట్టిండు నరాలుతేలంగ. కొత్తగా బదిలి ఫిల్లరైన జాన్‌మియా కండ్లల్ల రక్తం పేరుక పోయింది. ఎంకటి మనసు కోళ్ళుతవ్విన పెంటతీర్గ అయింది. కోపంతో కొమురయ్య పెదవి కరుచుకున్నడు.

అయినా వాళ్ళంతా మౌనంగా నడుచుకుంటూ బాయిమీదికొచ్చిండ్లు.

ఆఫీసుగేటుకాడ నిలుచున్న వాచ్‌మెన్ మొద్దుబారిన కాళ్ళను సరిచేసుకొని అటెన్షన్ల నిలుచున్నడు.

ఆఫీసులో పనిజేసే గుమస్తాలు, వోవరుమెన్లు, మేనేజర్లు. ఇంకా మిగిలినబాయి దొరలు కిటికీల మాటునుండి నక్కినక్కి కండ్లు ఎల్లబెట్టి చూస్తుండి పోయిండ్లు. ల్యాంపు రూమ్‌లో పనిజేసే మల్లయ్య బెదిరిపోయి, పోలీసోల్ల ఆజ్ఞలు పాటించింటు. వోవరుమెన్లు సర్దార్లు వాళ్ళపని వాళ్ళు నిర్వర్తించిండ్లు. ఇక మస్టరేసే గుమస్తాకెందుకో భయంతో చేతులు వణికినయి.

తూర్పుకు అభిముఖంగా ఉన్న బావిముఖద్వారము గుండా కార్మికుల్ని బలవంతంగా దింపుతున్నరు పోలీసులు. సర్కిల్ "బాయిలో దిగినట్టుకాదు. ఇసాబు సరిగా చేయకుంటే మల్లీనాకు రిపోర్టుచేయండి. ఒకొక్కని సంగతిచూస్తా." అంటూ బెదిరించటం మొదలుపెట్టిండు.

ఆఖరి టోపీనికూడా బాయి మింగేసింది.

అప్పటికే అక్కడికి పరిగెత్తుకొచ్చిన సూపరింటెండెంట్ (ఆఫ్‌మైన్స్) S.M. దొర రెండుజేబుల్ల చేతులుదోపుకొని నిలుచున్నడు.

'అచ్ఛా మేంవెళ్తామండి' అంటూ S. M. దగ్గరికొచ్చి సెకండ్ తీసుకున్నాడు. సర్కిల్.

"అప్పుడే ఏంతొందర- వెల్దురుగాని రండి" ఆఫీసువైపు దారితీసిండు S. M. కానిస్టేబుల్స్ S. I.లు బాయిమీద మిగిలిపోయిండ్లు.

సర్కిల్, సూపర్‌డెంట్ ఆఫీసులోకి అడుగుపెట్టిన మరుక్షణంలో AITUC లీడరు సూర్యారావు జీప్ వేసుకొని హడావిడిగా పరిగెత్తుకొనివచ్చి "నమస్తేసార్ ఏమిటి సంగతి" అంటూ సూపర్‌డెంట్ ఎదురుగా కుర్చీలో కూలపడ్డడు.

"ఏముంది అంతామామూలే. మీలీడర్లుఆడే నాటకమే ఇదంతా. ఎకనసుంచి ఎగతోస్తరు. మళ్ళీ ఏం తెలియనట్లుంటరు" అంటూ సర్కిల్ అర్థంకాని నవ్వు నవ్వింది.

"అమ్మమ్మ అట్లాఅనకండి. ఇప్పటి కార్మికులు మునుపటి కార్మికులు కారండి. మరీ తెలివిమీరిపోయారండీ. వేగలేక చస్తానమంటె నమ్మండి. పట్టు మంటే కప్పకుకోపం. విడువుమంటే పాముకుకోపమన్నట్లుగున్నది. మధ్యన మేం సచ్చిపోతానమండి" అంటు ప్యూన్ తెచ్చిన టీ కప్పు అందుకున్నాడు.

"అదే మీరు రెండువారాలుగా చెయ్యలేనిపని వీళ్ళు రెండుక్షణాల్లో జరి పించిండ్లు" అన్నాడు S. M.

"ఏమైందీ ఇంతకు" సూర్యారావు.

"బాయిలోకి దిగుతారా చస్తారా అన్నం. సచ్చినట్లుదిగిండ్లు" సర్కిల్ అధి కారికంగా నవ్వింది.

సూర్యారావు నవ్వుమొఖం మీదికితెచ్చుకొని "మంచిపనిచేసారండి. చిలక్కి చెప్పినట్టు చెప్పాం. ఒక్కడువినడే! సమ్మెవిరమించండి. ఏదన్న విషయముంటే మేం మాట్లాడుతం. కోర్టులున్నయి. కన్సిలేషన్లపెడ్తాం అన్నాం వినేటోడు ఒక్కడులేడే" అనాడు.

ఆ తర్వాత వాళ్ళు కాసేపు సర్కిల్‌గారి ప్రమోషనువిషయం, ఆ పైన అన్న గారి రాజకీయం మొదలుకొని క్లబ్‌లో రాత్రి D.S.P. గారిచ్చిన ఫుల్‌కౌంటు దాకా సాగించారు.

అలా బొయిలోకి బలవంతంగా దించబడ్డ కార్మికులు మెయిన్ జంక్షను కాడి కొచ్చిండ్లు అంతవరదాక గుంపులు గుంపులుగా వాళ్ళలో వాళ్ళ మాట్లడుకుంటున్న వాళ్లు ఒకచోట జమయిండ్లు.

'కామ్రేడ్స్ ఒక్కక్షణం ఆగుండ్లీ!' అందరు ఒక్కసారి మాటవచ్చిన వైపు తిరిగిచూసిండ్లు వాళ్ళ నెత్తిమీదటోపీకి తగిలించిన లైట్ల వెలుగులో రామస్వామి కోపంతో అగ్నితీర్గ కన్పించిండు.

"ఇయాల మనల్ని తుపాకులు చూయించి బొయిలకుదించిండ్లు. రేపుమనపక్క పొంటి తుపాకులు ఎక్కుబెట్టి పన్జేయిస్తరు."

"అవునవును నాసర్వీసుల గిటువంటి దౌర్జన్యం జరుగంగచూడలేదు" ముసలి రాజీరు.

'అందుకే కామ్రేడ్ మనం పనిచేయవద్దు'

"మారెగిట్లయితె మనమేంపన్జేస్తం?"

"బలవంతంగా దించనయితె దించిండ్లు కాని మనతోనినెవట్లచేయిస్తరో ఆడీ చూద్దాం" ఎవరోబొంగురు గొంతుకతోని అన్నాడు.

"ఎవరికితోసింది వాళ్ళు మాట్లాడుడేనా కాస్తఆగుండ్లీ ఒక్కల తర్వాత ఒక్కరు మాట్లాడుండ్లి. ఒకరిదిఒకరికి అర్థమైతలేదు." కాసేపు అందరు మౌనం వహించిండ్లు.

'మనఅందట్ల ఇగో గీ రాజీరు పెద్దమనిషి, ముందుగాల ఆయనమాట్లాడుతడు" ఇందాకటి యువకుడే మళ్ళీ అన్నడు.

ముసలి రాజీరు కొస్తతడబడ్డడు. తొర్రినోరు తొస్సుపోతాంచే "ఏం చెప్పంటరు. అందరు ఎట్లంటేగట్లనేచేత్తాం. మొదట్ల నేనుగీబాయి పనికొచ్చినప్పుడు ఎట్లున్నదో మొన్నటిదాక గట్లనే.... ఏందో పసురాల తీర్గపన్జేసెటోల్లం. ఏదన్న కష్ట మొస్తే గా లీడర్లకుపోయి చెప్పెటోల్లం ఇగ ఆయనా అంతోఇంతో తీసుకొని పన్జేసి పెట్టెటోడు. గిదిగిట్లెందుకున్నది గదిగట్లెందుకున్నదని అడిగినోడులేడు. సచ్చేటోడు సచ్చిండు. సావంగ మిగిలినోడు బతికిండు. అంతాఐదారేండ్లుగాబట్టె యువకులు వచ్చిండ్లు ఇగో గివిమన చట్టాలన్నారు. ఇవిమన హక్కులన్నరు. అగో అవి లీడర్లు చేసిన చేస్తున్నమోసాలు. కంపినోడు ఇగ్గో గిట్లకుట్ర చేస్తాండు అని ఇసారముచేసి చెప్పుకొచ్చిండ్లు. ఇంతవరదాక పసురాలతీర్గ పన్జేసేటోల్లు మెల్లమెల్లగా మనుసుల తీర్గ

ఆలోచించడం మొదలుపెట్టిండ్లు. అగ్గొగది తప్పయిపోయింది. మనమీద కేసులు పెట్టిండ్లు . అరెస్టులు చేస్తాండ్లు. మనపెయ్యిల మీద లాఠీలు ఇరుగుతానయి. మన పిల్లగాండ్లను కొట్టిండ్లు. మనఆడోల్లను చెరిచిండ్లు. ఊల్లకు ఊల్లుకాలీచేసి పారి పోయిండ్లు. అయినా లొల్లిఅగలేదు. కంపినోడు ఛార్జీషీట్లు, డిస్మిస్‌లు, లేఆప్‌లు, లాకౌట్లు చేసిండ్లు. కోతచట్టాలుపెట్టిండ్లు. అయినా లాబంలేకుంటయిందని పోలీసుల ఎగదోసిండ్లు. నిన్న మొన్నటిదాక పోలీసులు బాయిలమీద తిరిగిండ్లు. కాని ఇయ్యాల ఇదివరకు ఎప్పుడులేందీ ఓ కొత్త ఎత్తు ఎత్తిండ్లు. తుపాకులు సూయించి భయపెట్టించి పనులు చేయించాలని సూత్తండ్లు. ఇగదీన్నికూడా మనం వ్యతిరేకించాలి" అని చెప్పటం ఆపి ఆతర్వాత ఏంచెప్పాలో తెలియక ఆపేసిండు.

"కంపినోడు, లీడరోడు, పోలీసోడుముగ్గురు ఒక్కటై మనమీదకత్తిగట్టిండ్లు"

"అవునవును"

చివరిగా రామస్వామి చెప్పటము మొదలుపెట్టిండు

"కామ్రేడ్ సమ్మెకు సిద్ధమేనా" అడిగిండు.

పనులు బందు పెట్టాలి. సమ్మెచెయ్యాలి.

మేనేజుమెంటు పోలీసుల దౌర్జన్యం నశించాలి

దొంగట్రేడ్ యూనియన్ల విద్రోహం నశించాలి.

చివరిగా ఒక్కమాట కామ్రేడ్. "ఇయ్యాల మనబాయిమీద జరిగింది రేపు అన్ని బావులమీద జరుగుద్ది. కార్మికుల శత్రువులైన మేనేజుమెంట్, పోలీసులు, దొంగట్రేడ్‌యూనియన్లు ఒక్కటైండ్లు, మనంకూడా ఒక్కటికావాలి రేపుమనం అన్ని బావుల కార్మికుల్ని కదల్చాలి. దీనికి వ్యతిరేకంగా పోరాడాలి"

అండర్ గ్రౌండులో బొగ్గుపొరలమధ్య వాళ్ళ ఆలోచన చేస్తున్నరు, బొగ్గు ముక్కల్లాంటి కార్మికుల మధ్య నిప్పు రాజుకుంటున్నది.

దూరం నుండే కార్మికుల మధ్య జరుగుతున్న తర్జన భర్జనలు విన్న మేనేజర్ ఎందుకో అటునుంచి అటే వెనక్కి తిరిగిండు.

---

సవరణ

ఈ సంచిక 5వ పేజీలో అచ్చయిన ముక్తకంఠం కవితలో 'గుర్రింలా సకిలించే' అనే పాదం తర్వాత 'మా పడమటి గాలిని' అనే పాదం ఉండాలి.

— 'సాహితీ మిత్రులు'

పుస్తక సమీక్ష

# జానకి విముక్తి

(మార్చి సంచిక తరువాయి)

**ఆచరణ :**

ఈ నవలలో మరొక ప్రధాన అంశం ఆచరణ ప్రస్తావనగానీ, ఆచరణగానీ లేకపోవడం. మిగిలిన భావజాలాలకూ, మార్క్సిజానికీ మౌలికమైన తేడా అది ఆచరణ శాస్త్రమూ, అన్వయశాస్త్రమూ కావడమే. 'జానకి విముక్తి' మార్క్సిస్టు తత్వశాస్త్రంలో ఆచరణకున్న ప్రాముఖ్యతను దాదాపుగా విస్మరించింది. ఈ నవలా పాత్రల ఆచరణంతా అధ్యయనమే. కార్మిక సంఘాల ప్రస్తావన మాత్రం అక్కడక్కడ తొంగిచూసింది. రంగనాయకమ్మకు మార్క్సిజం సరిగానే అర్థమైందని ఈ పుస్తకమే ఓ పక్కనుంచి చెపుతోంటే, ఆచరణ ప్రాముఖ్యతను ఆమె గుర్తించలేదని అనుకోలేం. ఐతే రంగనాయకమ్మ ఉద్దేశ్యపూర్వకంగానే ఆచరణను ప్రస్తావించి ఉండరు. ఏ గ్రూపు ఆచరణా ఆమెకు అంగీకారయోగ్యంగా లేదు గనుక ఆమె ఆచరణను పూర్తిగా తిరస్కరించిఉంటారు. సరైన ఆచరణ కానిదేదో ప్రస్తావించి నప్పుడు, మార్క్సిస్టు దృక్పథంపట్ల బాధ్యతవహిస్తే ఆమెస్పష్టంగా సరైన ఆచరణను ప్రతిపాదించాలి. కాని ఆచరణ ప్రస్తావనే చెయ్యకపోవడం మాత్రం బాధ్యతా రాహిత్యమే. ఈ బాధ్యతారాహిత్యంతో పాటు రంగనాయకమ్మ ఆచరణ, అధ్య యనాల గురించికూడ చాల తప్పుడు అభిప్రాయాలు ప్రతిపాదించారు.

"మొట్టమొదట నువ్వు చెయ్యవలసింది కొన్నిపుస్తకాలు పట్టుకుపోయి ఒక గుహలో కూర్చుని చదివే తపస్సు ప్రారంభించడం. ఈ తపస్సు దేవుడికోసం కాదు, జ్ఞానంకోసం! అప్పుడప్పుడూ బైటికివచ్చి మళ్ళీ కొన్నిపుస్తకాలు తీసుకుని గుహలోకి పోతూవుండు...." (2.110-111) అనీ, "ముందు కమ్యూనిజం గురించి ఫండమెంటల్ విషయాలన్నీ నేర్చుకోవడానికి ప్రయత్నించు...." (2.106) అనీ కమ్యూనిస్టు మూర్తి సత్యానికి సలహా ఇస్తాడు. ఇది పుస్తకపూజ దృక్పథం. "నిరక్షరాస్య కార్మికులు చాలసార్లు మార్క్సిజాన్ని సరిగా గ్రహిస్తుండగా, మార్క్సిస్టు పుస్తకాలు చదివినవాళ్ళెంతోమంది విప్లవద్రోహులైపోయారు. మనం తప్పకుండా మార్క్సిస్టు పుస్తకాలు చదవాల్సిందే. ఐతే ఈ అధ్యయనం మనదేశ వాస్తవస్థితి గతులతో మిళితం చేయబడాలి. మనకు పుస్తకాలు అవసరమే. కాని వాస్తవ స్థితి గతులతో సంబంధంలేని పుస్తకపూజదశను మనం అధిగమించాలి" అని మావో

అన్నాడు గుహలోకూచుని వాస్తవంతో సంబంధంలేకుండా చదవడానికి భగవద్గీత ఐనా సెక్సుపుస్తకమయినా, మార్క్సు పుస్తకమయినా ఒకటే. నేర్చుకుంటున్న జ్ఞానం, బుర్రలో దిగుతున్నభావాలు సమాజ పరిశీలనకు, సమాజంలో బహిరంగంగా ఆలోచనకు పెట్టబడి నప్పుడే ఆ భావాల భౌతికశక్తి నిరూపితమవుతుంది. అంతేగాని మూర్తిచెప్పినట్టు మార్క్సు పుస్తకాలు చాటుగాచదువుకుంటే, ఆ పనిచేసేప్పుడు మరో పని చేయగూడదంటే ఆ భావాలు భౌతికశక్తిగా మారడమే ఉండదు. ఆచరణగా మారని అధ్యయనం, భౌతికశక్తిగామారని భావాలు ఎందుకూకొరగావు. అధ్యయనం దానికది ఆచరణకాదు. ఇందుకు మన తెలుగుసాహిత్యంలోనే ఉదాహరణచూడవచ్చు. కమ్యూనిస్టు భావజాలం భౌతికశక్తిగా రూపొందిన దశలు మనకురెండున్నాయి. ఈ రెండు దశలే పరిమాణంరీత్యానైనా, గుణంరీత్యానైనా మార్క్సిస్టు సిద్ధాంత అధ్యయనం విపరీతంగా జరిగినదశలుకూడ కావడం కేవలం యాదృచ్ఛికంకాదు. 1935-50ల మధ్య తొలిదశలో, 1965-66ల్లో ప్రారంభించి ఇప్పటిదాకా రెండోదశలో తెలుగులో కమ్యూనిస్టుభావజాలం పుస్తకరూపంలో విరివిగా వచ్చింది, వస్తోంది. భావాలు విప రీతంగా ప్రచారమయ్యాయి, అవుతున్నాయి. అధ్యయనంలోని ఈ అభివృద్ధికి కారణం వెంటవెంటనే భౌతికశక్తిగామారే పరిస్థితి ఉండడమే. మళ్ళీ 1950 నుంచి 65 దాకా ప్రోగ్రెసివ్ వాళ్ళువేసి పావలాకూ, అర్ధకూ పంచిన పుస్తకాలు తప్ప మరేమీరాలేదు. మొదటిదశలోవచ్చిన పుస్తకాల అధ్యయనంకూడ ఈ కాలంలో ఎందుకూ పనికిరాలేదు. మౌలికమైనకారణం ఆ భావాలను భౌతికశక్తిగా మలిచే ఆచరణ కార్యక్రమం లేకపోవడమే. కనుక భావాలు వాటికవిగా శక్తివంతంకావు, అవి నేర్చుకోవడమే ఆచరణకాదు. ముందు ఫండమెంటల్స్ అన్నీ నేర్చుకున్నాకనే ఆచరణలోకి దిగాలనేవాదన గతంలో ఎన్నోసార్లు చర్చించబడిందే. ఈత గురించి ఎన్నిగ్రంథాలు అధ్యయనంచేసినా, ఎంతగా ఫండమెంటల్స్ నేర్చుకున్నా నీళ్ళలో దిగకుండా ఈత నేర్చుకోవడం సాధ్యంకాదు.

### అధ్యయనం

అధ్యయనానికి మరీఎక్కువ ప్రాముఖ్యతనిస్తూ రంగనాయకమ్మ అధ్య యనంలో వచ్చే కష్టనష్టాలనుకూడ ఎక్కువచేసి చెప్పడానికి పూనుకున్నారు. దాంట్లో ఒక్కొక్కచోట ఔచిత్యాన్నికూడ పాటించలేకపోయారు. కార్మికుడు మోహన్‌కు మార్క్సిస్టు పుస్తకాల భాష అర్థంకాలేదంటే నిజమే అనుకోవచ్చు, కాని ఆధునిక సాహిత్యాన్ని విరివిగా చదివిఉన్న సత్యంకూడ ఈ భాష అర్థంకావడంలేదనడం

ఆశ్చర్యం కలిగిస్తుంది. టాల్‌స్టాయినీ, చలాన్నీ చదవడం, సరిగా అర్థంచేసుకొని, అభిమానం పెంచుకోవడం అంటే అతనికి ఆధునిక సాహిత్య పరిచయం, ఆధునిక భావాల పరిచయం ఉన్నాయన్న మాట మరి కమ్యూనిస్టు పుస్తకాల భాష అర్థం కాలేదనడం సరైందికాదు. ఐతే ఇది సత్యం సమస్యఐనా కాకపోయినా నిజమైన సమస్యే ఎంతోమంది ఎదుర్కొంటున్న సమస్యే. పాఠకులకు మాత్రమే కాక రచయితలకు కూడ వచ్చేసమస్యే ఇది. జనంతెలుసుకోవలసిన, జనానికి అర్థం కావలసిన దానికీ, తాముచెప్తున్న చెప్పగలుగుతున్న దానికీతేడా ఉందని వాళ్ళకు అనుమానం వస్తుంది. కాని ఈ రెంటి మధ్య నిజంగానే భేదం ఉందా? వైరుధ్యం ఉందా? ఈ రెంటి మధ్య ఉన్న వైరుధ్యంలో ఒకదానిలో ఒక్కటి కలిసిపోయే ఐక్యత అంశం ఎక్కువా? పరస్పరం రద్దు చేసుకునే ఘర్షణ అంశం ఎక్కువా? సమాజంపట్ల చైతన్యవంతంగా ఆలోచించేవాళ్ళు ఈ రెండూ శత్రు అంశాలుకావని, ఈ రెంటినీ ఏకం చేయ్యాలని, రెంటినీ ఒకే లక్ష్యానికి వినియోగ పెట్టుకోవాలనీ గుర్తించాల్సిఉంది. ఈతేడాను సమర్థవంతంగా పూరించిన పుస్తకాలు తక్కువ. చాల సిద్ధాంత గ్రంధాల అనువాదాలు సరళంగాలేవు. ఐతే అది భాష సమస్యకాదు. ప్రతి శాస్త్రానికీ ప్రత్యేక పదజాలం ఉన్నట్టే మార్క్సిజానికి కూడఉంది. ఆ పదజాలం ఏ భావాల్నిచెప్తున్నదో ఆ భావాలు మామూలు పాఠకుడి అవగాహనకు అందడం కష్టమవుతుంది. ఆ భావాల్ని పదజాలంలో కాక మామూలు మాటల్లో వివరించగూడదా అని కొందరడుగుతారు. అలామామూలు మాటలు వాడడంవల్ల పాఠకులకుఎక్కువగా అర్థమయ్యేమాట నిజమే గాని వర్గసమాజంలో అలాంటి మాటలకు నిర్దిష్టత ఉండదు. ఒక ఉదాహరణ చెప్పాలంటే సోషలిజం అనేది మామూలుమాటే అయిఉండవచ్చు. మార్క్సిజానికి పర్యాయపదంగా కూడ దీన్ని కొందరువాడుతారు. కాని ఇవాళ ఇందిరా సోషలిజంనుంచీ, బిజెపి గాంధేయ సోషలిజంనుంచీ నిర్దిష్టంగా మనసోషలిజాన్ని నిర్వచించుకోవడానికి పదజాలం అవసరమవుతుంది. పదజాలం వాడుతూకూడ, ఖచ్చితంగా ఉంటూకూడ అర్థంకావడానికీ, కాకపోవడానికి మధ్య ఉన్నతేడాను పూరించడం కష్టమేమీకాదు. అందుకు పుస్తకం వైపునుంచీ బాధ్యత ఉంటుంది. పాఠకుడి వైపునుంచీ బాధ్యత ఉంటుంది ఈ పాఠకుని బాధ్యతను రంగనాయకమ్మ కూడ మరొకచోట గుర్తించారు.

"....ఈ సైన్సుని కొత్తగానేర్చుకునే వాళ్ళ తేలిగ్గానూ, తొందరగానూ నేర్చుకోవడానికి పనికివచ్చే పుస్తకాలింకాలేవు.... సరళమైన భాషలోలేకపోవడంవల్ల

కొత్తవాళ్ళు ఒకటిరెండు పుస్తకాలు చూడగానే బెదిరిపోతారు. (మన కమ్యూనిస్టు నాయకులు ఈ 'భాష' సమస్యని ఎంతమాత్రం అర్థంచేసుకోరు. వాళ్ళనడిపే పేపర్లలో రాతలుకూడా ఎవరికీఅర్థంకావు)...."అని మూర్తి అర్థంకావడానికీ, కాక పోవడానికీఉన్న ఘర్షణ అంశాన్ని చెపుతూనే ".... ఆ సిద్ధాంతం నేర్చుకోవడమే ప్రధానలక్ష్యం కాబట్టి ఆ భాష ఎంత విసుగుకలిగించినా భరించు...." (2. 224-225) అని ఐక్యత అంశాన్నికూడ చెప్తాడు.

పదజాలానికి సంబంధించిన మరో రెండు అంశాలున్నాయి. కొన్ని పదాలు పదజాలం అనిపించనంత మామూలు అయిపోవడం మనం గమనిస్తూనే ఉన్నాం. అంటే ప్రాచుర్యంవల్ల పదజాలం మామూలైపోతుందన్నమాట. సోషలిజం అనే మాట అలాగే మామూలైపోయింది. ఆ మాట అంటేతప్పు ఎవడికైనా పప్పులుడకని స్థితిలో, 'పదజాలం'అని ఒకప్పుడు ఈసడించిన మాటల్నే పట్టుకువేళ్ళాడడం సర్వ సాధారణమే. కనుక పదజాలం సాపేక్షికమే అవుతుందిగాని ఎల్లప్పుడూ 'పదజాలం' గానే ఉండిపోయే మాటలేమీఉండవు. మరొకఅంశం, పదజాలం ఆచరణలో ఉన్న వాళ్ళకి 'పదజాలం'గా అనిపించకపోవడం. వర్గపోరాటంలో ఏదో ఒక రూపంలో పాల్గొంటున్నవాడికి వర్గపోరాటమనేమాట సత్యానికి కనిపించినంత భయంకరంగా కనిపించదు.

అధ్యయనంలో ఇబ్బందులకు సంబంధించి మరొక అంశంకూడఉంది. జ్ఞానమంతా ఏరోజుకారోజు, ఏమనిషికామనిషికి ప్రత్యేకంగా తయారుకాదు. ముందరి తరాల అనుభవాల సారంమీద ఆధారపడి కొత్తతరం కొత్తజ్ఞానాన్ని చేరుస్తుంది. ఇలా నిరంతరం ప్రతితరం ఆచరణతో జ్ఞానానికి చేర్పులు జరుగుతుంటాయి. అంటే ఈ జ్ఞానానికంతా ఒక క్రమంఉంటుంది. ముందరి జ్ఞానంగురించిన అవగాహన లేకుండా కొత్తజ్ఞానం అర్థంకావడం కష్టమే. మానవ చైతన్యానికంతటికీ సగర్వంగా వారసత్వం వహించగలిగిన తాత్వికచింతన ఫలితమే మార్క్సిజం. అందుకే మార్క్సిజం అర్థంకావడానికి సమాజచరిత్ర కనీసంగానైనా తెలిసిఉండడం అవసరం.

## మార్క్సిజం - చైతన్యం

'జానకి విముక్తి' నవల మాటలకూ చేతలకూ తేడాఉండే కమ్యూనిస్టుల్ని విమర్శించింది. కమ్యూనిస్టుమాటలు మాట్లాడుతూ, కమ్యూనిస్టు వ్యతిరేకపనులుచేసే చెడ్డకమ్యూనిస్టుల్ని విమర్శించే సందర్భంఅది. ఆ విమర్శను చేసిన సత్యం, శాంతల

మాటలకూ, చేతలకూ ఉన్నతేడాను పక్కనపెట్టి, ఇది తీవ్రంగా ఆలోచించవలసిన సమస్యేననేది గుర్తించాలి.

"కమ్యూనిస్టుల్లో మళ్ళీ మంచేవిటి? చెడ్డేవిటి? కమ్యూనిస్టు అంటేనే న్యాయానికి నిలబడేవాడనికదా మీఅర్థం?" అని శాంతను కమ్యూనిజంపట్ల సానుభూతి చూపుతూఉండే సీనియర్ లాయర్ అడుగుతాడు. (3. 253)

కమ్యూనిస్టులమని చెప్పుకునేవాళ్ళు కమ్యూనిస్టులుగా ఎందుకుండరు? అసలు కమ్యూనిస్టుగా ఉండడమంటే ఏమిటి? ఇదిమనకు రోజురోజూ ఎదురయ్యే ప్రశ్నే. "మీరుమాత్రం చక్కగున్నరా? కూలైరాయి తీసుకున్నాంక ఏట్లరాయితీయాలె" లాంటి ధూర్తత్వమూ, "మీకమ్యూనిజం మీపనుల్ని ఒప్పుకోదుగదా" అనే అమాయకత్వమూ మనకు ఎదురవుతూనే ఉంటాయి. ఈ దృక్పథానికి సంస్కరణవాదపువాసి ఉంటుందనే విషయాన్ని పక్కనపెట్టి దీనినుంచి మొట్టమొదట మనం తెలుసుకోవలసింది 'కమ్యూనిస్టులు కొన్ని పనులుచెయ్యరు' అని సమాజం 'చెడ్డపనులు' చెయ్యనివాళ్ళుగా కమ్యూనిస్టుల మీద ముద్రవేసింది. కమ్యూనిస్టు వ్యతిరేకులు కూడ ఈమాటలనడం మనం చూస్తూనే ఉన్నాం. "వాళ్ళు నిజంగా రాడికల్స్ కారండీ, ఐతే అట్లాంటి పనులుచెయ్యరు" అని తెలంగాణ దొరలు తొలిరోజుల్లో అంటుండే వాళ్ళు. అంటే వాళ్ళకు కూడ రాడికల్స్ అంటే మంచికి నిలిచేవాళ్ళని నమ్మక తప్పలేదన్నమాట. (తమ దగ్గరికొచ్చినప్పుడు మాత్రం ఆపని మంచిపని కాకుండాపోయి, ఆరాడికల్స్ నిజంరాడికల్స్ కాకుండాపోతారు.!) ఇలా కమ్యూనిస్టులు చేయదగిన, చేయగూడని పనుల్ని సమాజమే నిర్దేశించి పెట్టింది. అందుకే సమాజం చెడ్డపనులని, కమ్యూనిస్టులు చేయని పనులన్ని అనుకున్న వాటిని కమ్యూనిస్టులు చేసినప్పుడు ప్రశ్నలు తలెత్తుతాయి.

మరి నిజంగానే కమ్యూనిస్టులు కమ్యూనిస్టులు కాకుండాపోయే సందర్భాలు కూడ ఉన్నాయి. ముఖ్యంగా రెండురకాలుగా ఈ ప్రమాదాలు వస్తాయి- సమాజం కమ్యూనిస్టుల మీదవేసే ప్రభావంవల్లా, తాను స్వయంగాచేసే, చేయదలుచుకున్న పనులవల్లా. ఆ కమ్యూనిస్టుగనుక మంచి కమ్యూనిస్టయిఉంటే, అంటే ప్రతిరంగం లోనూ వర్గపోరాటంలో పాల్గొంటున్న వాడయితే, వ్యవస్థతో పోరాడుతూనే, ఎల్లప్పుడూ తనతోతానుకూడ పోరాడుకునే క్రమంలోఉంటే రెండో ప్రమాదం తప్పిపోతుంది. కాని మొదటిరకం ప్రమాదాన్ని నివారించడం కొంచెంకష్టం. చుట్టూ ఉండే సమాజం మౌలికంగా ఫ్యూడల్ విలువల సమాజం. అదికేవలం ప్రభావం

వెయ్యడంద్వారా, మాత్రమేకాదు. కొనివెయ్యడంద్వారా, బెదిరించడం ద్వారా, ఒత్తిడితేవడంద్వారా కమ్యూనిస్టును గెలుచుకోవాలని చూస్తుంది. కమ్యూనిస్టు తనతో తాను చేసుకునే పోరాటంలో ఎంతదృఢంగా ఉండగలిగితే అంతదృఢంగా ఈ వ్యవస్థ ప్రలోభాన్నీ, ప్రభావాన్నీ, హింసనో ఎదిరించగలుగుతాడు. తనతో తాను చేసుకునే పోరాటాన్ని మాత్రమేగాక వ్యవస్థతోచేసే పోరాటాన్నికూడ వదులుకున్న వాడు కమ్యూనిస్టుఅని పిలిపించుకోవడానికే అనర్హుడు. కాని మనదేశంలో ఇలాంటి అనర్హులే అనేకమంది కమ్యూనిస్టులుగా చలామణి అవుతున్నారు. వీళ్ళమీద విమర్శ ఎక్కుపెట్టవలసి ఉండిన 'జానకి విముక్తి'లో వ్యవస్థమీద పోరాటం మచ్చుకైనా లేదు. తనతోతాను చేసుకునే పోరాటంకూడ వర్గపోరాటపు ఒక ప్రతిఫలనమే. అది చర్చకాదు, ఆచరణ.

మార్క్సిజం అంటే ఏమిటి? కేవలం శ్రామికవర్గానికి రాజ్యాధికారం సమకూర్చిపెట్టే సిద్ధాంతమేనా? అంతకుమించిన, సమాజంలోని అన్నిరంగాలనూ ప్రభావితం చెయ్యగలదని చెప్పుకుంటున్న మార్క్సిజం ఏ ఏ రంగాలను ప్రభావితం చేస్తున్నది? జీవితంలోకి మార్క్సిజం ఎంతవరకు ప్రసరిస్తున్నది? మార్క్సిజం అంటే జండానా, బోర్డా, బ్యాడ్జా, సభ్యత్వరశీదా? చైతన్యమా, జీవన విధానమా? ఈప్రశ్నలు భారత కమ్యూనిస్టు ఉద్యమం, ముఖ్యంగా తెలుగునాట కమ్యూనిస్టు ఉద్యమం సీరియస్‌గా ఆలోచించినట్టు కనిపించదు మార్క్సిజం ఒక జీవిత విధానమనీ, ఒక సర్వాంగీణ చైతన్యమనీ తెలుగు "మార్క్సిస్టు"ల్లో చాలమంది గుర్తించినట్టు తోచదు. మొదటితరం "మార్క్సిస్టులు" మహోపాధ్యాయుల బొమ్మలకు పూలదండలు వేయడం. అగరొత్తులు వెలిగించడం, ఇళ్ళముందు సుత్తెకొడవలి ముగ్గులు వేసుకోవడం, పొగాకు, సినిమా, పుస్తకాల వ్యాపారాల్లోకిదిగడం, ఆయా కుటుంబాల స్త్రీలు పుస్తెల్లో ఉంగరాలలో సుత్తెకొడవలి చెక్కించుకోవడం దగ్గర మొదలుపెట్టి నక్సల్బరీ తరం "మార్క్సిస్టు"లు సారావ్యాపారాలూ, సినిమా వ్యాపారాలూ, విదేశీ నిధులకు విప్లవసమర్థన రంగులద్దడమూ చేయడందాకా మార్క్సిస్టులమని చెప్పుకుంటున్నవాళ్ళ సాంఘిక, వ్యక్తిగత విలువల్లో ఒక దారీ తెన్నూలేని పతనం ఎందువల్ల కనబడుతోంది? రాజకీయ విశ్వాసాల్లోని నిర్దుష్టత విలువల్లో పతనాన్ని ఎందుకు ఆడ్డుకోలేకపోతోంది? ఈ విలువలగురించిన ప్రస్తావనను ఎవ ఎలాతెస్తారు? శరీరం, ఆత్మల సిద్ధాంతాన్ని మనవాళ్ళు మార్క్సిజానికి కూడ అన్వయించి, ఫ్యూడల్‌గా ఉంటూనే ఇష్టంవచ్చినప్పుడల్లా మార్క్సిజం అనే

తొడుగులోకి పరకాయప్రవేశంచేస్తూ ఉండవచ్చునా? ఇది ఏంతమాత్రమూ చెల్లడానికి వీల్లేదు. అకడమిక్ తత్వశాస్త్ర తరగతుల్లో చదివినట్టు మార్క్సిజం అనేకానేక తత్వశాస్త్రాల్లో ఒకానొకటిమాత్రమేకాదు. పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్, ఎకనమిక్స్ పాఠాల్లో బోధించినట్టు మార్క్సిజం ఒక ప్రగతి నమూనాకాదు. అది కేవలం శ్రామికవర్గ రాజ్యాధికారసిద్ధాంతం మాత్రమేకాదు. అదిఒక జీవితవిధానం. ఇరవై నాలుగు గంటలూ మనజీవితంలో ప్రతిఫలిస్తూ ఉండవలసిన చైతన్యం మార్క్సిజం. ఈ ఇరవైనాలుగుగంటల్లో వర్గపోరాటం వేరువేరు స్థాయిల్లో, వేరువేరు రంగాల్లో మనకు ఎదురవుతుంది. ఈ వర్గపోరాటక్రమానికంతటికీ చారిత్రిక అనివార్య ఫలితమే శ్రామికవర్గ రాజ్యాధికారం.

మార్క్సిజంఒక చైతన్యమనీ, జీవితవిధానమనీ 'జానకివిముక్తి'లో కొన్ని పాత్రలు కొంతవరకు గుర్తించినట్టు కనబడుతుంది. ఐతే వాళ్ళకు సొంతజీవితం లేదు. రంగనాయకమ్మ సృష్టించి ఇచ్చిన జీవితం తప్ప.

### ఆచరణ వాయిదా

నవలలో ఏడాది వయసున్న బ్రూనో తాను "పెద్దయ్యాక" రెడార్మీలో చేరతానంటాడు (3.588). ఇంకెక్కడా ఆచరణ మాటేలేక, హఠాత్తుగావచ్చిన ఈ రెడార్మీరిక్రూట్మెంట్ చూసి మనం ఆశ్చర్యపోతాం. బ్రూనో ముందరి తరం అధ్యయనం ద్వారా ఒక వాతావరణాన్ని సమకూర్చిపెడితే, అతనితరం రెడార్మీఅయి విప్లవం తెస్తుందని రంగనాయకమ్మ అభిప్రాయమని తోస్తుంది. ఇది రంగనాయకమ్మ ఉద్దేశం అవునోకాదో స్పష్టంగా తెలియదుగాని తెలుగునాట ఇప్పుడిప్పుడే బలహీనంగా వస్తున్న ఇలాంటి వాదనకు ఈ ఉదాహరణ ఒకగుర్తు. ఇప్పుడు ప్రైమరీ స్కూళ్ళలో ఉన్నతరం యవ్వనంలోకి వస్తేనే భారత విప్లవోద్యమం గట్టెక్కుతుందని ఈ వాదన వినవస్తోంది. 'జానకి విముక్తి' బ్రూనోను చూసినా, ఈవాదన ప్రకారం చూసినా విప్లవాన్ని. విప్లవాచరణను ఒకతరం వాయిదా వేయాలనే ధోరణి కనబడుతుంది. విప్లవోద్యమం ఒక భౌతిక వాస్తవికతగా ఉండగా, ఆ విప్లవోద్యమమే వ్యక్తంగానో, అవ్యక్తంగానో తమకు కూడ ప్రేరణనిస్తూ ఉండగా విప్లవోద్యమం లేదనీ, సరిగా లేదనీ బుకాయించడం, ఎప్పుడో భవిష్యత్తులో విప్లవోద్యమం ప్రారంభమవుతుందని, జోస్యంచెప్పడం సాగుతున్న విప్లవోద్యమంపట్ల తమ బాధ్యతా రాహిత్యాన్ని సమర్థించుకోవడానికే.

# అధికార హత్యాకాండ

గోదావరి అడవులలో ఇంతవరకు పూర్తిగా కలప వ్యాపారానికీ కాగితం పరిశ్రమకూ పెట్టుబడిగా మారిపోని ప్రాంతాలలో కరీంనగర్ జిల్లా మహదేవ్‌పూర్ ఒకటి. ఒకప్పటి విశాలమయిన మంథని తాలూకా తూర్పుభాగానవున్న విశాలమయిన అడవిప్రాంతం మహదేవ్‌పూర్ బ్లాకు. టేకు, మద్ది, విప్ప, బొంగు, తుమ్మ, ఇంకా మనకు పేర్లుతెలీని ఎన్నోచెట్ల జాతులకు నిలయం.

దట్టమయిన ఈ అడవిలో తారురోడ్డుకు 35 కిలోమీటర్లు దూరనవుంది బోర్లగూడెం అనేగ్రామం. కరీంనగర్‌ను వరంగల్‌నుండి, మహదేవ్‌పూర్ అడవిని చిట్యాల అడవినుండి వేరుచేసే వంకరటింకర విభజనరేఖకు ఇటువైపుందా అటువైపుందా అక్కడికివెళ్లేదాకా తెలియనంత సమీపంలోవుంది. ఎటువైపుందో ఆగ్రామ ప్రజలకుగూడ అప్పుడప్పుడు అనుమానం వస్తుందేమో, ఎందుకంటే ఆ సరిహద్దుకు చిట్యాల సమితి కేంద్రం అడవులూ ఏర్లుదాటి తూర్పుకు 70 కిలోమీటర్లు దూరంఉంటే, మహదేవ్‌పూర్ సమితికేంద్రం పడమటికి అటువంటివే మరొక 70 కిలోమీటర్ల దూరంవుంది. అది బ్లాకులతోను బ్లాక్ డెవెలప్‌మెంట్‌తోను సంబంధంలేని అధివాస్తవిక ప్రపంచం. లేక, బహుశా, బ్లాకులు బ్లాక్ డెవెలప్‌మెంట్లు అనే అధివాస్తవిక ప్రపంచంతో సంబంధంలేని చాలా వాస్తవిక ప్రపంచం.

బోర్లగూడెంను ఆనుకొని దేవునితండ అనే లంబాడ తండవుంది. 350 కుటుంబాలకు నివాసమయిన ఈ గ్రామాన్ని కేంద్రి రిజర్వుపోలీసులు (సిఆర్‌పి) చరిత్ర కెక్కించారు. హింసాకాండకు ప్రత్యేకమయిన పేరు సంపాదించుకున్న సిఆర్‌పి దళాలను తెలుగుదేశం ప్రభుత్వం ఉత్తర తెలంగాణలోని అయిదు జిల్లాలలో సాయుధపోలీసు క్యాంపులలో నియమించడానికి కేంద్రంనుండి అరువు అడిగినప్పుడు, భారత సామాజిక నీతిగురించీ, మనపాలక వర్గాల రాజనీతి గురించీ తెలిసిన వారికి రెండు విషయాలు నిస్సందేహమనపించాయి. ఒకటి, ఇందిరమ్మ ఆ మొర ఆలకిస్తుందని. రెండు, సిఆర్‌పి జవాన్లు మన తెలుగుజాతి జవాన్లకంటే తాము సుశిక్షితులమనీ (చట్టంనుండి సురక్షితులమనీ) త్వరలోనే ఆచరణాత్మకంగా రుజువు చేసుకుంటారని. ఇందిరమ్మ ఇవ్వనే ఇచ్చింది. వచ్చినవాళ్ళు నెలతిరక్కముందే బోర్లగూడెంలో ఒక హత్యచేయనే చేసారు. హత్య జరిగింది 1984 జనవరి 10 నాడు. హతుడు దేవునితండకుచెందిన జర్పుల అమ్రి అనే 45 సంవత్సరాల లంబాడారైతు.

అంతకు ముందు (గంత సంవత్సరం. అక్టోబర్ నెలనుండి) ఆప్రాంతంలోని కొన్ని గ్రామాల ప్రజలు 'సాదా పోరాటం' చేస్తారు. ప్రభుత్వపు రెవెన్యూ ఆశవల్ల, బడా కాంట్రాక్టర్ల గుత్తాధిపత్యం వల్ల, అమితంగా పెరిగిపోయిన సారాధర తగ్గాలని పట్టు బట్టి పందగ్రామలు రెండు రూపాయల పావల నుండి రూపాయి ముప్పావలకు తగ్గించుకున్నారు. పోరాటంలో భాగంగా సారా దుకాణాలను బంద్ పెట్టించి సారా కాంట్రాక్టర్లను లొంగదీసారు. మరొకవైపు అదే సమయంలో ఉత్తర తెలంగాణ గ్రామాలలోని పోలీసు క్యాంపుల సంఖ్య పెరుగుతూ పోతోంది. సెప్టెంబర్‌లో 80 ఉన్నవి జనవరికి 100 అయి ఇవాళ్ళ 120 దాటినవి. ఈ క్రమంలో డిసెంబర్ 13 నాడు, ఒరిస్సానుండీ కొత్తగా తరలివచ్చిన సిఆర్‌పి దళాలతో బోర్లగూడెం, నిమ్మగూడెం, కనుకునూరు, ములుగుపల్లి గ్రామాలలో క్యాంపులు వచ్చాయి. ఈ క్యాంపు జవాన్లు యధాప్రకారం ఆగ్రామాల ప్రజలను 'కోళ్లు, కల్లు' ఇమ్మని పీడించడం మొదలుపెట్టారు. సింగారంలో కోడి ఇవ్వనన్నందుకు బొబ్బిలి రామయ్యను బజారుకు ఈడ్చికొట్టారు. కొత్త రేగులగూడెంలో సారా ఇవ్వనన్నందుకు గుంజ బుచ్చమ్మను కడుపులో తన్నారు. కిష్టాపురంలో సారా కాంట్రాక్టరును వెంటబెట్టుకుపోయి, గతంలో 'సారాపోరాటం' వలన కాంట్రాక్టరుకు నష్టం కలిగించినందుకు ఆ పోరాటంలొ చురుగ్గాపాల్గొన్న వాళ్లు ఒక్కొక్కరినుండి 50 రూపాయలు కాంట్రాక్టరుకు ఇప్పించారు. బోర్లగూడెంలో అమ్రిను చంపారు.

దిక్కులేని వాళ్లంతా నక్సలైట్లేనన్న పోలీసు తర్కంలో తప్ప అమ్రి 'నక్సలైటు' కాడు. రెండో అయిదో ఎకరాల రైతు. కొంతకాలం క్రితం అతనొక ఎద్దునుకొన్నాడు. 1200 రూపాయలు పెట్టికొన్నాడు. జనవరి 10 ఉదయం అతని కొడుకు దేవు, దేవుమిత్రులు భీక్యబాలు, భీక్యవాలు, గ్రామందగ్గరి అడవిలో ఆ ఎద్దును మేపుతున్నారు. ఇద్దరు క్యాంపు జవాన్లు ఒకబరువైన కలపమొద్దును మోసుకొని అడవినుండి వస్తున్నారు. అడవినుండి గిరిజనులు కట్టెతెచ్చుకుంటే అదినేరం గాని, గిరిజనులనుండి అడవిని కాపాడడానికి నియమించబడ్డ ఫారెస్టు అధికారులయినా, గిరిజనులనుండి ఈ సమాజాన్ని కాపాడడానికి నియమించబడ్డ పోలీసులయినా, తెచ్చుకుంటే అదినేరంకాదు ఆజవాన్లు ఎద్దుకు మరీ సమీపంగా పోవడంచూసి దేవుగాభరగా 'దగ్గరకుపోవద్దు, అదికొత్తఎద్దు, పొడుస్తుంది.' అని వారించాడు. అస్సాంలో యుపిలో బీహార్‌లో ఎన్నో వందలమందిని రాక్షసంగా పొట్టనబెట్టుకున్న మేము ఒక ఎద్దుకు భయపడతామా, సిగ్గుసిగ్గనుకొని కలపదుంగను కిందదించి వాళ్ళలో ఒకడు ఎద్దుకొమ్ములు రెండూ పట్టుకున్నాడు. అయితే మనిషికి తప్పవేరే ఏ జంతువుకూ

'రాజ్యం' అనే వ్యవస్థగాని దానికి సంబంధించిన స్పృహగాని వుండదు. రాజ్యం అనే స్పృహ లేకపోతే సివిల్ మనిషికీ పోలీసుకూ తేడాతెలీదు తెలీక అవద్దు అతన్ని ఎత్తి కిందపడేసింది. అతను లేచి నిక్కరు దులుపుకొని మిత్రుడి దగ్గర తుపాకి తీసుకొని ఎద్దుసు 'ఎన్‌కౌంటర్' చేయడానికి గురిపెట్టాడు. 'రాజ్యం' అనేది కొందరికి స్పృహ అయితే కొందరికి మత్తుమందు. ఆ స్పృహలేనివాడికి సివిల్ మనిషికీ పోలీసుకూ తేడాతెలిసినట్టే ఆ మత్తులోపడ్డవాడికి అసలు మనిషికీ ఎద్దుకూ తేడా తెలీదు. అంతలో అముర్రి పరుగెత్తుకొచ్చి కానిస్టేబిల్ కాళ్లమీదపడ్డాడు. నాఎద్దును చంపొద్దన్నాడు. పోలీసులు అమ్రిని తుపాకులతో డొక్కలోపొడిచి కలపదుంగను అతని నెత్తికి ఎత్తించి క్యాంపుదాకా మోయించుకువెళ్లారు. అక్కడ అతను దుంగను కిందపడేయగానే ఒళ్లుహూనమయ్యేదాకా కొట్టారు. కాళ్లావేళ్లాపడ్డా వదిలిపెట్టలేదు. క్యాంపు పక్కనే ఇల్లున్న కల్లి అనే 25 సంవత్సరాలస్త్రీ అడ్డుపోతే ఆమెను బెదిరించారు. ఆమె ఇంకొందరిని తీసుకురావడానికి పారిపోతూ వెనక్కితిరిగిచూసింది. వాళ్లు అమ్రిను మళ్లీ కిందపడేసి తుపాకులతో పొడుస్తున్నారు. కడుపులోపేగులు తెగిపట్టున్నాయి. ఆమెతిరిగి వచ్చేసరికి స్పృహ తప్పి పడివున్నాడు. దగ్గరిలోవున్న ఆజంనగర్‌కు తీసుకుపోతే అక్కడి ఆర్ ఎం.పి. డాక్టరు వైద్యంచేయడానికి నిరాకరించాడు. రోగికి వైద్యం నిరాకరించడం వైద్యవృత్తికే అపచారం. కాని ఆ నీతులన్నీ పోలీసు క్యాంపులులేని జమానాలో, పోలీసు రాజ్యంలో అలాంటి నీతులు మాట్లాడితే నిన్నూ 'నక్సలైట్' అంటారు. బ్రిటిష్ వాళ్లు ఒక్క భగత్‌సింగ్‌ను మాత్రమే భగత్‌సింగ్ అన్నారు. మనవాళ్ళయితే అతని తల్లినీ చెల్లెనూ పొరుగింటి మిత్రుడినీ వెనకింటి అల్లుడినీ అందరినీ అనివుండేవాళ్లు. ఆ రాత్రికి అమ్రి చనిపోయాడు. ఊరిజనం అమ్రి శవాన్ని తీసుకొచ్చి క్యాంపుదగ్గరపెట్టి పోలీసులను నిలేసారు, పోలీసులు వాళ్ళమీదికిగూడ తుపాకులు తీసారు.

తరువాతిరోజు కరీంనగర్‌జిల్లా ఎస్.పి.తో సహా చాలా మంది పెద్దపోలీసు ఆఫీసర్లు ఎంతో ప్రయాసబడి బోర్లగూడెం వచ్చారు. తమ ఇలాఖాలో ఇంత మారుమూల గ్రామం ఒకటి ఉందని అంతవరకు వాళ్లకుతెలీదేమో. ఎస్.పి. లంబాడ వాళ్లందరినీ కూర్చోబెట్టి హితోపదేశం చేసాడు. 'జరిగిందేదో జరిగింది. గొడవ చేయొద్దు' అన్నాడు. అమ్రి కొడుకు దేవును చూపించి, 'ఇతనికి కానిస్టేబుల్ ఉద్యోగం ఇప్పిస్తాను' అన్నాడు. ఇంకా నయం, ఆ ఎద్దును గూడ రిక్రూట్ చేసుకుంటాననలేదు. ఆయనగారి దృష్టిలో కానిస్టేబుల్ నౌకరీని మించిన సన్మానం

ప్రపంచంలో లేదు. కాని అడవిలో చెట్లునరుక్కొని వ్యవసాయం చేసుకునే వాళ్లకు పోలీసు బ్రతుకు కంటె ప్రకృతి విరుద్ధమయినది మరొకటి వుండదు. పైగా, మనిషి ప్రాణాన్ని సర్కార్ నౌకరీతో వెల్లబెడదామనే నాగరికతత్వం వాళ్లకు ఏహ్యంగా కనిపించింది. 'మమ్మల్నందరినీ చంపేసి మా కొడుకులను పోలీసులను చేస్తావా? ఇంక అప్పుడు నీకు వేరే పోలీసు క్యాంపు గూడ అక్కరలేదు గదా' అని ఒక ముసలి రైతు కోపం చేసుకున్నాడట. అయినా ఈ అమానుషమయిన వాగ్దానం గూడ శుష్కమయినదే. ఇంత వరకు దేవుగాని ఆతని ఎడ్డుగాని ఖాకీ తొడుక్కోలేదు. అదే పది వేలు.

సరిగ్గా మూడునెలల తరువాత, ఏప్రిల్ 12 నాడు, నిజామాబాద్ జిల్లాలో రెండవ 'క్యాంపు హత్య' జరిగింది. గిద్ద కామారెడ్డితాలూకాలో ఒక పెద్ద గ్రామం. సిరిసిల్ల తాలూకాను కామారెడ్డి తాలూకా నుండి వేరుచేసే అడవికి సమీపంలో వుంది.

నిజామాబాద్ కరీంనగర్ జిల్లాల నుండి అరబ్ దేశాలకు కూలి పని కోసం చాలా మంది వెళుతూంటారు. దీన్ని 'మస్కట్-దుబాయి' వెళ్లడం అంటారు. ఇట్లా వెళ్లేవాళ్లకు ఉద్యోగాలనుండి పాస్‌పోర్టులదాకా అన్నీసమకూర్చిపెట్టే వ్యాపారం ఇవ్వాళ ఆజిల్లాలలో అతిముఖ్యమయిన పరిశ్రమ. ఈ బ్రోకర్లు ఎక్కువగా పట్టణాల నుండి వచ్చినవాళ్ళుకారు. స్థానిక భూస్వాములే చాలమంది తమ సాంప్రదాయిక దొరతనాన్ని ఉపయోగించుకొని ఈ బ్రోకర్ పనిమీద గుత్తాధిపత్యం సంపాదించు కున్నారు. సంపాదించుకుని, వెట్టిచాకిరీ దండుగలు వగైరా పాతదోపిడీ పద్ధతులు ఆగి పోవడం వలన తాము కోల్పోయిన పెత్తనాన్ని ఈ రూపంలో కొనసాగిస్తున్నారు. అటువంటి ఒక బ్రోకర్-భూస్వామి భూపాల్‌రెడ్డి గిద్దకు చెందిన యువకులనుండి 'మస్కట్-దుబాయి'కి పంపిస్తానని 40 వేల రూపాయలు వసూలుచేసి ఎగవేసాడు. రాడీకల్స్ అతన్ని పట్టుకొని అందులో సగం వాపస్ ఇప్పించారు. ఇటువంటివే మరి కొన్ని 'అత్యాచారాల' ఫలితంగా గత సంవత్సరం జూలై నెలలో గిద్దలో ఏ పి ఎస్. పి. క్యాంపు పెట్టారు. ఆటుతరువాత గ్రామంలో క్యాంపు వస్తూ పోతూవుంది.

ఆ కాలంలోనే గిద్దలో పోలీసులు చేసిన మరొక ఘనకార్యం గురించిగూడ చెప్పుకోవాలి. ఆప్రాంతంలో ప్రజలలో పనిచేసి ప్రమాదవశాన చనిపోయిన రాంచందర్ తదితరులకోసం గిద్దలో 30అడుగుల ఎత్తుస్థూపం నిర్మాణమవుతుండగా, జూలైనెలలో ఒకనాటి ఉదయం పోలీసులు ట్రక్కులలో వచ్చి స్థూపాన్ని కూల గొట్టించి వెళ్లారు. ఇది కాకతాళీయమయిన సంఘటనకాదు. ఈ వ్యవస్థను కూలివాళ్ల

నుండి కాపాదేక్రిమంలో పోలీసులు పుస్తకాల దొంగలయినట్టే స్థూపాల దొంగలు గూడ అయ్యారు. ప్రజలుతమ పోరాటానికి జ్ఞాపకంగా వుంచుకునే ఏ చిహ్నాన్నీ ఉండనివ్వరు. మేడే జెండాలు చింపేస్తారు, అమరవీరుల జీవితాలకు బురదపూస్తారు, స్థూపాలు తవ్వేస్తారు స్థూపంనిర్మాణానికి తమశ్రమను వెచ్చించిన కూలీలెవ్వరో కనుక్కొని, అతిక్రూరంగా వాళ్ళచేతనే గునపాలతో స్థూపాన్ని తవ్వించేస్తారు. పోలీసుల హింసాకాండ నిర్హేతుకమయిన రాక్షసప్రవృత్తినుండి పుడుతుందనే అభిప్రాయాన్ని పత్రికలూ సినిమాలూ ప్రచారంచేస్తున్నాయి. ఆ రాక్షసప్రవృత్తి అధికారానికి 'సహజం' అని కొందరుభావిస్తే, దానికి వైయక్తికమయిన మానసిక కారణాలను 'అర్ధసత్య' వంటిసినిమాలు చూపుతాయి. అసలు విషయమేమిటంటే పోలీసు హింస అనేది ఎవ్వరి మానసిక రాక్షసత్వంతోనూ ఇష్టాయిష్టాలతోను ప్రమేయంలేని అనివార్య వాస్తవమయినట్టే, అది ఏమాత్రం నిర్హేతుకంకాదు. అదిచాల తెలివిగా, అర్ధవంతంగా, హేతుబద్ధంగా పనిచేస్తుంది, ప్రజా ఉద్యమానికి చిహ్నాల అవసరం ఎంతవుందో వాళ్ళకుతెలుసు ఒకఅమరవీరుడిని వ్యభిచారిగా చిత్రించినా అతని స్థూపాన్ని కూలగొట్టించినా అదిఎంతటి దెబ్బో వాళ్ళకుతెలుసు. స్థూపాన్ని నిర్మించిన వాళ్ళచేతే దాన్ని తవ్వించేస్తే ఒక్కొక్క గునపంవేటూ ఆ ప్రజల మనస్సులమీద ఒక్కొక్క సమ్మెట పోటనిగూడ వాళ్ళకుతెలుసు. అందుకే స్థూపాలు తవ్వించేయడం ఒక కార్యక్రమంగా పెట్టుకున్నారు గిద్దలో రాంచందర్ అతని సహచరమృతవీరుల స్థూపం బెల్లంపల్లిలో పెద్దిశంకర్ గంగారామ్ మొదలయిన ఆదిలాబాద్ జిల్లా మృత వీరుల స్థూపం, ఖట్టుపల్లిలో జన్ను చిన్నాలు స్థూపం, కుక్కల గూడూరులో భూమయ్య కిష్టగౌడ్ తదితర కరీంనగర్ మృతవీరుల స్థూపం. తవ్వించేసారు.

క్యాంపు వచ్చినతరువాత అక్రమఅరెస్టులూ చిత్రహింసలతోబాటు పోలీసులు యథాశక్తి ప్రజలను దోచుకోవడం మొదలుపెట్టారు. అడవిప్రాంతం కావడంవల్ల వాళ్ళదృష్టి కట్టెమీదపడింది. గ్రామంలో స్కూలుకట్టియ్యాలని రాడికల్స్ సేకరించిన కట్టెను జప్తుచేసుకొని క్యాంపులో వేసుకున్నారు. ఫారెస్ట్ డిపార్ట్మెంట్‌కు అప్పజెప్పి కేసుపెట్టించడానికికాదు, వడ్రంగివాళ్ళచేత తమకోసం మంచాలు చేయించుకోవడానికి (ఆ వడ్రంగులకు అది వెట్టిచాకిరేనని వేరే చెప్పనవసరంలేదు)

ఏప్రిల్ 12న హత్యచేయబడ్డ పోతయ్య గిద్దకుసమీపంలోవున్న రాధాయిపల్లి నివాసి. ఒకపూరిగుడిసె, ముగ్గురు పిల్లలు, అతనిఆస్తి. ఆనాటిరాత్రి పోతయ్య తన ముసలితల్లితో వివాదంపెట్టుకొని కోపంతో ఒకకుండను ఎత్తికిందపడేసాడు.

విరిగిన కుండపెంకులు ఎగిరి పక్కింటి నర్సయ్యకు తగిలాయి. నర్సయ్యకూ పోతయ్యకూ తగువుజరిగింది. నర్సయ్య పోలీసుక్యాంపులో ఫిర్యాదుచేసాడు. గ్రామంలో పోలీసుక్యాంపువుంటే వాళ్ళకు 'చెంచా'లగానూ, ఇన్‌ఫార్మర్లుగాను పనిచేస్తూ తమ అవసరాలు సాధించుకునే పంచమాంగదళం త్వరలోనే తయారవుతుంది. పోలీసులకు అవసరమయిన వెట్టిచాకిరీ సమకూర్చిపెట్టడం, వాళ్ళ చీకటి అవసరాలకు దాఫర్లగా పనిచేయడం, వాళ్ళకు గ్రామాన్నిగురించి సమాచారాన్ని (అవసరమయితే కల్పించి) అందజేయడం, వీళ్ళపని. సమాజం పాలకులుగా ప్రజలుగా చీలితే రాజ్యంపుట్టింది. ఆ ప్రజల్ని మరింతచీల్చకుండ రాజ్యం పరిపాలించలేదు. రాజ్యం ఎక్కడ ప్రవేశిస్తే అక్కడ ప్రజల్ని చీలుస్తుంది.

నర్సయ్యకూ క్యాంపుపోలీసులకూ ఇటువంటి సంబంధం ఏమయినా ఉందేమో తెలీదు. పోలీసులుమాత్రం వెంటనేవచ్చి పోతయ్యను పట్టుకొని మాటామంతీ లేకుండా డొక్కలోపొడుస్తూ కొడుతూ గిద్దవైపు నడిపించారు. అతనితల్లి కొట్టొద్దని బ్రతిమాలింది. ఆమె ఆక్రందన పోలీసులకంటెముందు యముడికి వినబడింది. దారిలోనే పోతయ్య రక్తంకక్కుకుని చనిపోయాడు.

తెల్లవారి గ్రామస్తులంతా క్యాంపుదగ్గర గొడవచేసారు. అంతకాలం పోలీసులు అడవినుండి తెచ్చుకొని దాచుకున్న కలపను బయటికి లాగారు. ప్రజల ఒత్తిడిమీద స్థానిక ఎం. ఎల్. ఏ గూడ తన అమూల్యమయిన నిరసన తెలిపాడు. అసెంబ్లీలో తనపార్టీవాళ్లు ఏమంటున్నారో కాసేపుమరచిపోయి, అసలు గిద్దలో పోలీసుక్యాంపు అవసరమేలేదన్నాడు. 'ఒక అవినీతిపరుడయిన ఫారెస్ట్ అధికారిని చంపితే పోలీసు క్యాంపులుపెట్టి మమ్మల్ని ఇంతగా హింసిస్తున్నారు. పోతయ్యను చంపినందుకు మిమ్మల్ని ఏంచేయాలి?' అని ప్రజలు ప్రశ్నిస్తున్నారు.

ఆ మాటే అందరూ అడుగుతున్నారు. ప్రజలలో ఎవరయినా మంచికయినా చెడుకయినా 'అశాంతి'కి పాల్పడితే అధికార యంత్రాంగానికి బూట్లూ బుల్లెట్లూ తొడిగి వాళ్ళమీదికి దించుతున్నారు. మరి ఆ అధికారయంత్రాంగమే హత్యలూ మానభంగాలూ చిత్రహింసలూ చేస్తే? అప్పుడు ప్రజలు ఆ తుపాకులను తిరిగేయొచ్చా?

— కె. బాలగోపాల్

## పుస్తకస్వీకారం

1. కవితాఝరి – కాలువ మల్లయ్య. పేజీలు : క్రౌన్ 48; వెల : 3 రూ. లు; ప్రతులకు : కన్వీనర్, జనహిత సాహిత్య సమితి, 7-4-45/1 కాశ్మీర్‌గడ్డ కరీంనగర్ - 505 002

2. జనంగొంతుక (పౌరహక్కుల ప్రజాసంఘం బులెటిన్) జనవరి 1984.

3. చైతన్యం (పీడిత ప్రజారాజకీయ మాసపత్రిక) ఫిబ్రవరి 84 పేజీలు : 1/- డెమ్మీ 20: వెల : 1 రూ.

4. వడిసెల (సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక) ప్రారంభ సంచిక మార్చి 1984; పేజీలు : 1/8 డెమ్మీ 44; సం. చందా : 20 రూ॥ లు చిరునామా వి. ప్రకాశ్, ఎడిటర్, 324 ఇ. డబ్ల్యు. ఎస్. హెచ్., న్యూ సంతోష్ నగర్ కాలనీ, హైదరాబాద్ - 500 659.

5. ఈనాటికీ......... కవితలు : - నిఖిలేశ్వర్ ; పేజీలు : 1/8 డెమ్మీ 12 + 72 ; వెల : 11 రూ. ప్రతులకు : నవత పబ్లికేషన్స్, ఇం. నెం. 2-1-164/సి, నల్లకుంట, హైదరాబాద్ - 500 044.

6. లావా – హెచ్చార్కె కవిత : పేజీలు : క్రౌన్ 8 + 98. వెల : 3 రూ. ప్రతులకు : విమోచన ; 8/9. ఎం. ఐ. జి. ఎ. పి. హెచ్. బి. కాలనీ, జాగ్‌లింగంపల్లి. హైదరాబాద్ – 44.

7. శక్తిధార- గింజల నరసింహారెడ్డి కవితలు ; పేజీలు : డెమ్మీ 64 వెల : 7రూ. ప్రతులకు : జి. నరసింహారెడ్డి. నకిరేకల్ ; నల్గొండ జిల్లా- 508 211 లేదా వేణు సంకోజు. 6-3-35/ఎ. రామగిరి, నల్గొండ, 508 002.

8. సిలకమ్మ పాటలు - దొండపాటి రామారావు: పేజీలు 4 + 48 వెల: రూ. 3 ప్రతులకు: నవశక్తి ప్రచురణలు, ప్రకాశం వీధి, గిరింపేట, చిత్తూరుజిల్లా.

9. ఎచ్చరిక-బోయ జంగయ్య కథలు : పేజీలు : క్రౌన్ 8 + 66 వెల : రూ. 7 ప్రతులకు : చేతన జనరల్ స్టోర్స్, నల్లగొండ - 508 001.

10. జనహిత - కవితా సంకలనం - ఎస్. కె. పళ్ళే : పేజీలు : క్రౌన్ 6 + 44 వెల : రూ. 2-50 పై. ప్రతులకు : జనహిత సాహిత్యసమితి, 7-4-45/1, కాశ్మీరుగడ్డ, కరీంనగర్ - 505002.

11. జైలు - నాటిక - కళ్యాణరావు ; పేజీలు : క్రౌన్ 4 + 24 వెల : రూ. 3

12. అరుణ - నాటిక - కళ్యాణరావు ; పేజీలు : క్రౌన్ 4 + 36 వెల : రూ. 4

13. తొలిపొద్దు-నాటకం - కళ్యాణరావు ; పేజీలు : క్రౌన్ 6 + 106 వెల : రూ. 6

14. ఇడియట్ - (IDIOT) - నాటిక - కళ్యాణరావు ; పేజీలు : క్రౌన్ 4 + 30 వెల : రూ. 3

పై ప్రతులకొరకు సి. ఎస్. ఆర్. ప్రసాద్. సి -108, శ్రీనివాసనగర్, గుంటూరు లేదా సోషలిస్టు బుక్ సెంటర్, ట్రంక్‌రోడ్, ఒంగోలు : సృజన, హనుమకొండ, వరంగల్‌కు రాయండి.

